# సంతోషవార్త!

చందమామ మార్చి 1966 సంచికలో ప్రచురించబడ్డ సినీ మాసపత్రిక నామకరణ పోటీలో గడువు తేదీనాటికి 5865 మంది పాఠకులు పాల్గొన్నారు. వీరికి మా కృతజ్ఞత. ఇందులో ఒకేఒకరు సూచించిన

# విజయచిత్ర

అనే పేరును ఎన్నుకోవడం జరిగింది. ఈ పేరును సూచించిన సోదరికి మా హృదయపూర్వక అభినందనలు!!

గెలుపొందిన వారు:

**శ్రీ మైలవరపు జానకీదేవి,**

C/o. శ్రీ సోమినేని వెంకట్రావుగారు (ప్లీడరు),

ఇన్నీసుపేట, రాజమండ్రి (ఆంధ్ర ప్రదేశ్).

గెలుపొందిన ఆమెకు బహుమాన పైకం రు. 116/-పంపబడును. పైగా ఒక సంవత్సరము వరకు "విజయచిత్ర" పత్రిక ఉచితంగా పంపబడును.

## డాల్టన్ పబ్లికేషన్స్

(బాక్స్ నం. 3)

'చందమామ బిల్డింగ్స్' :: మదరాసు-26

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



ASP/GM/K-12 TEL.

అహో ...కోలినోస్
స్వచ్ఛత లేక తాజాదనం కొరకు!





అహో ...కోలినోస్
చల్లని, తియ్యని రుచి కొరకు!

అహో ...కోలినోస్
సమృద్ధయిన నురగ కొరకు!



అహో ...కోలినోస్
శ్వాసలో తియ్యని సువాసన కొరకు!





ఆ ఐదో బాలునికి ఒక్క కిటుకు: కోలినోస్ వాడి ఒక్క చిరునవ్వు అందరిలాగే! ప్రతి రోజూ రాత్రి మరియు ఉదయము కోలినోస్ డెంటల్ క్రీమ్‌తో పళ్లను బ్రష్ చెయ్యాలి. స్నేహితుల సహవాసంలో అధిక విశ్వాసము...అధిక ఉల్లాసము!

## స్వచ్ఛమైన పళ్లు! తాజాశ్వాస!

అహో ...కోలినోస్




Registered user: GEOFFREY MANNERS AND COMPANY LIMITED

దిలీప్, యీ సాయంత్రం
నీతో క్యారమ్సు ఆడుదా
మని వచ్చాంమేం.

అంత విచారంగా
వున్నావేం దిలీప్?

నా రామచిలుక -
రాముా
యీ మిట్టమధ్యాహ్నం
ఎగిరిపోయింది.

దిగులుపడకు.
పారిపోయిన పెంపుడు
పక్షులు, జంతువులు
తిరిగి ఇంటికి వచ్చేస్తా
యని మా నాన్న
చెప్తుంటేవిన్నా.

# దిలీప్ బృందం
## ఎగిరిపోయిన రామచిలుకను పట్టుకున్నారు

కీచు
కీచు
టప
టప

అదిగో రాముా
అరుపులా వినిపిస్తోంది!

అలా పెర్లి
చూద్దాం
పదండి.

నా 'ఎవరెడి'
టార్చి తెస్తా
నుండండి.

ఎక్కడేనా
కనిపించిందా?

లేదు. నాకేం
కనిపించడంలేదు.

దిలీప్! అదిగో
రాముా. ఆ తీగె
మీద కూర్చుంది.

అలాచూడు.
రాముా పిల్లి కంట
పడింది.

అదే! అదే
నా రాముా!

ఎవర్నీ పిలవకు. రాముా
బెదిరి ఎగిరిపోతుంది.
అశోక్, మేడమీదకెళ్లి
కిటికీలోంచి ఆ పిల్లిని
తరిమేయ్.

పిల్లి పారిపోయింది.
రాముామీద నా 'ఎవరెడి'
కాంతిపడేలాచేస్తా.
కళ్లు కనిపించవ్. ఎగిరిపో
లేదు. ఓ నొకర్ని
పిల్చి రాముాను పట్టుకో
మనండి.

రాముా పట్టుబడింది! హాయ్ హాయ్!

'ఎవరెడి' టార్చి నా దగ్గ
రుండడం నిజంగా
అదృష్టమే!

JWTUC 2926



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికతో "చందమామ"కు పంధొమ్మిదేళ్ళు నిండాయి. ఇంతకాలంగా పాఠకుల ఆదరాభిమానాలను తరుగులేకుండా పొందగలుగుతున్నందుకు "చందమామ" చాలా గర్విస్తున్నది.

ఈ సంచికలో కొత్త అట్టచివరి బొమ్మ సీరియల్ "అరణ్యపురాణం" ప్రారంభమవుతున్నది. ఇది రుడ్యార్డ్ కిప్లింగ్ అనే ఆంగ్ల రచయిత రచించిన "జంగిల్ బుక్" లోని కథకు అనుసరణ. గత సంచికలో ప్రారంభమయిన "పాతాళదుర్గం" సీరియల్ పాఠకుల ఆదరాభిమానాలను చూరగొంటున్నదని తెలపడానికి సంతోషిస్తున్నాము. అలాగే ఈ "అరణ్యపురాణం" కూడా పాఠకుల ఆసక్తిని చూరగొంటుందని ఆశిస్తాము.

సంపుటి: 38 - జూన్ 1966 - సంచిక: 6

CHITRA



# భారత చరిత్ర




శివాజీ అనంతరం అతని పెద్ద కొడుకు శంభూజీ (శంభాజీ) రాజ్యానికి వచ్చాడు. ఇతను భోగలాలసుడే గాని గొప్ప శూరుడు. ఇతనికి కవికులశు డనే ఉత్తరదేశపు బ్రాహ్మణుడు ముఖ్య సలహాదారుగా ఉండేవాడు. శంభూజీ పరిపాలనలో మహారాష్ట్ర రాజ్యం బలహీన మయింది, కాని స్తంభించిపోలేదు. మొగలుల వల్ల గల ప్రమాదం శంభూజీకి బాగా తెలుసు. ఔరంగజేబు దక్కనుకు తెచ్చిన పెద్ద సేనలతో అతను ధైర్యంగా పోరాడాడు. అయితే, 1689 ఫిబ్రవరి 11 న, రత్నగిరికి 22 మైళ్ళ దూరాన ఉన్న సంగమేశ్వరం వద్ద, అతను ముకర్రబ్ ఖాన్ అనే వాడికి దైవికంగా చిక్కిపోయాడు. అదే సమయంలో అతని సలహాదారు కవికులశుడూ, మరి ఇరవైఅయిదుగురు ముఖ్యానుచరులూ కూడా పట్టుబడిపోయారు. మొగలులు శీఘ్రంగానే అనేక మరాఠాదుర్గాలను పట్టుకుని, మరాఠా రాజధాని అయిన రాయగఢాన్ని కూడా ముట్టడించారు.

అయితే శంభూజీ తమ్ముడు రాజారాం సన్యాసివేషం వేసుకుని రాయగఢ నుంచి తప్పించుకు పోయి, అనేక అగచాట్లు పడి, చివరకు కర్ణాటకప్రాంతం లోని జింజీ చేరుకున్నాడు. ఈ లోపుగా మరాఠారాజధాని శత్రు వశమయింది. శంభూజీ కుటుంబం, అతని పసికొడుకు శాహూతోసహా మొగలులకు చిక్కారు. మహారాష్ట్ర ప్రభ నిర్మూలమైనట్టే కనబడింది.

కాని శివాజీ చేత ఉత్తేజితులైన వాళ్ళు అంత సులువుగా లొంగేవాళ్ళు కారు. వాళ్ళు మొగలులతో తిరిగి జాతీయవిమోచన సమరం ఆరంభించారు. ఈ సమరంలో చివరకు మొగలుల శక్తులన్నీ నీరుకారిపోవటం జరిగింది. ఈ సమరానికి

57. శివాజీ అనంతరం

మహారాష్ట్రుల తరపున నాయకత్వం వహించిన వారు రామచంద్రపంత్, శంకరజీ మల్హార్, పరశురామ్‌త్రింబక్.

ఇప్పుడు ఔరంగజేబుకు ఎదురైనది "ప్రజాయుద్ధం." దీన్ని ఎలా కొనసాగించాలో ఔరంగజేబుకు తెలియలేదు. మరాఠా రాజ్యం గాని, రాజసైన్యం గాని ఉంటే దాన్ని నిర్మూలించవచ్చు, కాని అవి లేవు. సంతాజీ ఘోర్పడే, ధనాజీ జాదవ అనే సమర్థులైన ఇద్దరు మరాఠానాయకులు ఎక్కడబడితే అక్కడ తమ సేనలతో విరుచుకుపడి, మొగలులకు తీవ్రమైన సంక్షోభమూ, తీరని నష్టమూ కలిగించి, మెరపులాగా ఎటో వెళ్ళిపోయేవారు. వీళ్ళు చక్రవర్తి శిబిరాలను కూడా కొల్లగొట్టారట. మొత్తం మీద అనేకమంది మొగలు అధికార్లు తమ భద్రత కోసం మహారాష్ట్రులకు "చౌథ్" చెల్లించిన మాట నిజం. కొందరు శత్రువుతో చేరిపోయి చక్రవర్తి ప్రజలనే దోచారు. సంతా,ధనాల పేర్లు దిక్కుదిక్కులా ప్రతిధ్వనించాయి. వారా కాలానికి వీరాధివీరులు. మొగలుసామ్రాజ్యవాదులు వీరినేమీ చెయ్యలేకపోయారు.

జుల్‌ఫికర్‌ఖాన్ అనే మొగలు సేనాని జింజీకి దాదాపు ఎనిమిదేళ్ళపాటు ముట్టడి



వేసి, చివరకు 1698 జనవరిలో దాన్ని పట్టుకున్నాడు. అయితే రాజారాం అక్కడి నుంచి సాతారాకు పారిపోయాడు. అక్కడ అతను బలమైన సేనను పోగుచేసుకుని, ఉత్తరదక్కనులో ఉన్న ఔరంగజేబు బలాల పై యుద్ధం చేశాడు. 1699 డిసెంబరులో మొగలులు సాతారా దుర్గాన్ని ముట్టడించారు.

1700 మార్చి 12 న రాజారాం చనిపోయాడు. అంత దాకా ముట్టడిని వీరోచితంగా ప్రతిఘటించిన మహారాష్ట్రులు కొన్ని షరతుల మీద దుర్గాన్ని మొగలుల అధీనంచేశారు.



అది మొదలు పాదుషా స్వయంగా ఒక్కొక్క మరాఠాదుర్గాన్నే వశపరుచుకో నారంభించాడు. కాని అది వ్యర్థప్రయత్నమే అయింది. ఏమంటే, ఇవాళ చిక్కిన దుర్గం రేపు చెయి జారిపోయేది. యుద్ధం అనంతంగా సాగుతూ పోయింది.

రాజారాం మరణానంతరం అతని భార్య తారాబాయి మహారాష్ట్రులకు నాయకురాలయింది. ఆమె తన కొడుకైన మూడవ శివాజీ తరఫున రాజ్యం చేస్తూ, అసాధారణ ప్రతిభ కనబరిచింది. ఆమె భర్త జీవించి ఉన్నప్పుడే పరిపాలనా వ్యవహారాలలో ఆమె చాకచక్యానికీ, సమర్థతకూ గొప్ప ఖ్యాతి వచ్చింది.

రాజ్యం కోసం జరిగే కుమ్ములాటలను అణచిపెట్టి, తారాబాయి మొగలుల ప్రాంతాలలోని సిరంజ్, మందసోర్ మొదలైన ఆరు సుబాలను కొల్లగొట్టటానికి చురుకైన దాడులను ఏర్పాటు చేసింది.

మరాఠాదండులు 1703 లో బిరారు పైనా, 1706 లో గుజరాతు పైనా దాడి చేసి, బరోడాను కొల్లగొట్టాయి. 1706 ఏప్రిలు, మే నెలలలో ఒక పెద్ద మహారాష్ట్ర సేన అహమ్మద్‌నగర్ లోని పాదుషా శిబిరం పైకి వెళ్ళింది. వారిని చెదరగొట్టటం మొగలులకు బ్రహ్మప్రయత్న మయింది.

ఈ సమయానికి మహారాష్ట్రులు తమ బలాలను చక్కగా కూడగట్టుకుని, దక్కనులోనూ, మధ్యభారతం లోని కొన్ని ప్రాంతాలలోనూ దాదాపు తమకు పోటీ లేకుండా చేసుకో గలిగారు. వాళ్ళు మొగలు సేనా నాయకులను పూర్తిగా బెదరగొట్టారు. వారి యుద్ధతంత్రంలో కూడా దర్పం ప్రవేశించింది. వారిలో మొగలులంటే ఏ మాత్రమూ భయం లేదు. ఎక్కడికి వెళ్ళినా జయం తమదే నన్నట్టు వెళ్ళారు. వారిని అణచడానికి ఔరంగజేబు చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయాయి.



# నేహ్రూ కథ

## 24



స్వరాజ్యపార్టీ కార్యభారాన్ని మోతీలాలు ఒంటరిగా మొయ్యా వలసివచ్చింది. ఆయన ఆ ఎన్నికలలో తన ప్రతిపక్షులతో హోరా హోరి పోరాడాడు.

మొత్తంమీద నేషనలిస్టు పార్టీకి చెప్పుకో దగిన విజయం చేకూరింది. శాసనసభలలో కుడిపక్షం మరింత బలపడింది. పెద్ద భూస్వాములూ, బిరుదులుగలవారూ, పారి శ్రామికులూ అందులో ప్రవేశించారు; వారికి రాజకీయాలతో ఏమీ సంబంధంలేదు.

1926 ఆఖరులో ఒక మతోన్మాది స్వామిశ్రద్ధానందను నిద్రపోతూండగా హత్యచేశాడు. గూర్ఖాల తుపాకులకు రొమ్ము చూపి ఎదురు వెళ్ళిన మహాధీరుడు ఒక హంతకుడి కత్తికి బలి అయాడు. ఎనిమి దేళ్ళ క్రితం ఆయన ఢిల్లీలోని జామా మసీదులో హిందూ ముస్లిముల సమిష్టి సమావేశంలో గంభీరోపన్యాసం చేసినప్పుడు "హిందూ ముసల్మాన్‌కీ జై!" అన్న నినా దాలు పిక్కటిల్లాయి. అలాటి మహావ్యక్తి ఒక స్వజాతీయుడి చేత హత్యకావటం తెలుసుకుని జవాహరు చాలా కలత చెందాడు.

1927 ఫిబ్రవరీలో బ్రుసెల్స్‌నగరంలో పీడితప్రజల మహాసభ జరిగింది. కొమిం టాంగు (చీనా) వామ పక్షీయులూ, ఇతర వలసదేశాలవారూ, అమెరికా కాలికింద నలిగే దక్షిణ అమెరికావారూ, వామ, కార్మిక పక్షాలవారూ చేరి ఈ సమావేశం ఏర్పాటు చేశారు. యుద్ధానంతరం జర్మనీలో సామ్రాజ్యవాదం పోవటంచేత అక్కడి ప్రభుత్వం అభ్యంతరం చెప్పలేదు. ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ వగైరా సామ్రాజ్యదేశాలు కళ్లెర్రజేశాయి. జావా, ఇండోచైనా, పాలస్తీనా, సిరియా, ఈజిప్టు వగైరాదేశాల ప్రతినిధులూ, ఆఫ్రికా ప్రతి



నిధులూ, నీగ్రో ప్రతినిధులూ అందులో పాల్గొన్నారు. ఈ సమావేశం జరగబో తున్నట్టు ముందుగానే తెలిసి జవాహరు, కాంగ్రెసుప్రతినిధులను కూడా పంపవలిసిం దని రాశాడు. ఆ పని అతనిపైనే పెట్టారు. సామ్రాజ్యవ్యతిరేక కూటమి ఒకటి ఏర్పా టయింది. అందులో జవాహరు కూడా ఒక సభ్యుడు. యూరపులో ఉండగా జరిగిన కూటమి సమావేశాలలో అతను పాల్గొన్నాడు. చివరకు 1931 లో కాంగ్రెసుకూ, బ్రిటిషు ప్రభుత్వానికీ సామరస్యం ఏర్పడినప్పుడు కూటమిలో నుంచి జవాహరును తొల గించివేశారు.



1927 వేసవిలో మోతీలాలు యూరపు వచ్చాడు. కొద్ది నెలలపాటు అందరూ కలిసే ఉన్నారు. నవంబరులో రష్యాలో విప్లవ దశమ వార్షికోత్సవం జరిగింది. నెహ్రూ లందరూ దానికి వెళ్ళి, నాలుగు రోజులు మాస్కోలో గడిపారు. అది మోతీలాలుకూ, జవాహరుకూ కూడా ఒకగొప్ప అనుభవంగా పరిణమించింది.

ఆ డిసెంబరు ఆఖరు వారంలో కాంగ్రెసు మహాసభ మద్రాసులో జరుగు తున్నది. దానికి అందుకోవాలనే ఉద్దేశంతో జవాహరు తన భార్యనూ, చెల్లెలినీ, కుమార్తెనూ వెంటబెట్టుకుని స్వదేశానికి తిరిగి వచ్చాడు.

యూరపులో దాదాపు రెండేళ్ళు గడిపిన ఫలితంగా జవాహరుకు రాజకీయ అంత స్సంఘర్షణ పూర్తిగా రహితమైపోయింది. అతని దృక్పథం విశాలమయింది. జాతీయ వాదం ఒక్కటే చాలదు. రాజకీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మొదటి మెట్టు మాత్రమే. సాంఘిక స్వేచ్ఛా, సోషలిస్టు వ్యవస్థా లేనిదే దేశం గాని, వ్యక్తి గాని అభివృద్ధి చెందటం సాధ్యం కాదు. సోవియట్ రష్యాలో కొన్ని అవాంఛనీయమైన అంశాలు కనిపించినప్పటికీ, ఆ దేశం అతన్ని బాగా



ఆకర్షించింది; ప్రపంచం యొక్క పురోభి వృద్ధికి సూత్రం అక్కడే అతనికి కనిపించింది. యూరపులో ఎన్నో గొప్ప పరిణామాలు రాబోతున్నాయి, వీటికి అనుగుణంగా దేశాన్ని ఇప్పటి నుంచే తయారుచేయాలి. కాంగ్రెసు ఎంతసేపూ రాజకీయంగానే ఆలోచిస్తున్నది. కాంగ్రెసు వెలపల కార్మిక, యువక వర్గాలలో బోలెడంత కృషి చెయ్యవచ్చు, గ్రామ ప్రాంతాల ఎంతో పని చెయ్యవచ్చు.

కాని జవాహరు కనిన ఈ కలలు ఫలించలేదు. అతను మళ్ళీ కాంగ్రెసు రాజకీయ సుడిగుండం లోనే పడ్డాడు. అతను మద్రాసు కాంగ్రెసు సమావేశానికి అనేక తీర్మానాలు తయారు చేశాడు. దాదాపు అన్నీ కూడా వర్కింగు కమిటీ తీర్మానాలుగా ఆమోదించబడ్డాయి. అతనికి ఆశ్చర్యం వేసింది. సాధారణ సమావేశంలో అతనే వాటిని ప్రతిపాదించాడు. అన్నీ ఆమోదించబడ్డాయి. అతని స్వతంత్రతా తీర్మానాన్ని ఆనీబిసెంటు స్వయంగా బలపరిచింది. ఇదంతా చూసి జవాహరుకు ఒక పక్క ఆనందం కలిగినా మరొక పక్క, తన తీర్మానాల అంతరార్థం అందరికీ అర్థమయిందా అన్న సంకోచం బాధించింది.



సమావేశం ముగిసే లోపలనే ఈ సంకోచం నిజమని రుజువయింది. రానున్న సైమన్ కమిషనును బహిష్కరించాలన్న తీర్మానం లోని ఒక అంశం, నెహ్రూ ప్రతిపాదించిన స్వతంత్రతా తీర్మానాన్ని అబద్ధం చేసేసింది!

ఆ యేడు కాంగ్రెసు అధ్యక్షుడు డాక్టరు అన్సారి, జవాహరుకు బహుకాల మిత్రుడు. అదీగాక జవాహరు ప్రతిపాదించిన తీర్మానాలనేకం ఆమోదించబడ్డాయి; వాటిని అమలు లోకి తేవాలి. ఈ కారణాలచేత జవాహరు తిరిగి కాంగ్రెసు సెక్రెటరీ పదవికి సమ్మతించాడు. ఇందు కింకొక బలమైన

కారణం కూడా ఉన్నది—కాంగ్రెసు దిగజారిపోకుండా చూడటం!

1928 లో భారతదేశంలో సర్వతోముఖ చైతన్యం ఉన్నట్టు జవాహరుకు తోచింది. కార్మికులూ, వ్యవసాయ శ్రామికులూ, యువకులూ, మేధావులూ, అన్ని వర్గాలూ చైతన్యవంతంగా ఉన్నాయి. జౌళి పరిశ్రమలోనూ, రైల్వేలలోనూ కార్మికులు సమ్మెలు జరిపి, తమ బలాన్ని ప్రదర్శిస్తున్నారు. కర్షకరంగం కూడా అలాగే చురుకుగా ఉన్నది. సర్దారు వల్లభాయిపటేలు నాయకత్వం కింద బార్డోలీ సత్యాగ్రహం విజయవంతంగా సాగటమే గాక, దేశం లోని వ్యవసాయ రంగానికంతకూ గర్వకారణమై, ప్రోత్సాహన్నిచ్చింది. అలాగే యూత్ లీగులు దేశమంతటా వెలిశాయి. వాటిలో చాలా రకాలున్నాయి; కొన్ని లీగులు మతసంబంధమైనవి, మరి కొన్ని విప్లవ దృక్పథం కలవి.

వీటన్నిటినీ మించిన సంఘటన సైమన్ కమిషను బహిష్కరణ. ఈ బహిష్కరణ విషయంలో మితవాద వర్గాలు కాంగ్రెసుతో కలిసి బహిష్కరణకు పూర్తి విజయం చేకూర్చాయి. సైమన్ కమిషన్‌వారు వెళ్ళిన చోట నల్లా "సైమన్ గో బాక్" అన్న నినాదం మారుమోగింది. అసంఖ్యాకమైన భారతీయులకు సైమన్ పేరు తెలియటంతో బాటు రెండు ఇంగ్లీషు మాటలు కూడా పరిచయ మయాయి!

ఈ సందర్భంలో ఒక సంఘటన జరిగినట్టు జవాహరు తన ఆత్మకథలో చెప్పుకున్నాడు. సైమన్ కమిషన్‌వారు న్యూఢిల్లీలోని వెస్టరన్ హొటల్లో ఉండగా రాత్రివేళ చీకట్లో నుంచి "సైమన్ గో బాక్" అన్న కేకలు వినవచ్చాయిట. రాత్రివేళ కూడా ఈ నినాదం తమను విడిచిపెట్టక పోవటం వారు సహించలేక పోయారట. తీరా విచారిస్తే, అవి నక్కలకూతలట.






# పాతాళదుర్గం

## 2

[కుంతలదేశ మంత్రికొడుకైన శశికాంతు డనేవాడు, ఇద్దరు మిత్రులతో వేటకై అరణ్యానికి వెళ్ళి, శత్రుబాణం వల్ల గాయపడ్డాడు. భద్రు డనేవాడు పారిపోయి, రాజధానీనగరం చేరాడు. కుంతలరాజూ, మంత్రీ అరణ్యంలో ఏం జరిగివుంటుందా అని చర్చిస్తూండగా, సైనికుడొకడు వచ్చి కదంబరాజు దూతలను పంపినట్టు వాళ్ళకు చెప్పాడు. తరవాత—]

కదంబ రాజైన ఉగ్రసేనుడి దూతలు నలుగురు, ఇద్దరు ఖైదీలతో సభామందిరానికి వచ్చారు. శతభానుడు సింహాసనం మీద ఆసీనుడయివున్నాడు. గంగాధరుడు దూతల వెంట వున్న ఖైదీల చేతికట్లు విప్పవలసిందిగా సేవకులను ఆజ్ఞాపించాడు.

రాజసేవకులు ఖైదీల కట్లు విప్పబోయేంతలో ఉగ్రసేనుడి దూతల్లో ఒకడు ముందుకు వచ్చి, గంగాధరుడికి తల వంచి నమస్కరిస్తూ, "మహామంత్రులు నన్ను క్షమించాలి. వీళ్ళిద్దరూ పరమ క్రూరులు, అతి సాహసులు," అంటూ ఖైదీలను సమీపించి, తన చేతికర్రతో ఒకణ్ణి పొడుస్తూ, "వీడు ధూమకుడు, పితృహంతకుడు; యీ రెండవవాడు సోమకుడు; భ్రాతృహంతకుడు," అన్నాడు.

"ఈ హంతకుల్ని మా వద్దకు పంపడంలో, మీ మహారాజుగారి అభిప్రాయ



మేమిటి?" అని ప్రశ్నించాడు మంత్రి గంగాధరుడు.

ఆ ప్రశ్న వింటూనే తతిమ్మా ముగ్గురు దూతలూ ముందుకు వచ్చారు. అందరూ ఒకేసారి మాట్లాడబోయిన వాళ్ళల్లా, మొదటి దూత సౌంజ్ఞ చేయగానే ఆగిపోయారు. అప్పుడు మొదట మాట్లాడిన దూత, శత భానుడి కేసి తల ఎత్తి చూసి, తరవాత మంత్రికీ, రాజుకూ వినబడేంత పెద్ద గొంతుతో, "మహారాజులూ, మహామాత్యు లకు, మా ప్రభువులు ఉగ్రసేన మహ రాజులుంగారు గౌరవపూర్వకంగా నమ స్కారాలు చేసి, దుఃఖకరమైన వార్త ఒకటి యిలా విన్నవిస్తున్నారు: కదంబరాజ్యంలో ఏ కారణం వల్లనో ప్రవేశించిన కుంతలదేశ మహామంత్రుల పుత్రుడూ, వారి అనుచరు లిద్దరూ, ఖైదు నుంచి పారిపోయిన ధూమ కుడూ, సోమకుడూ అనే హంతకుల వల్ల గొప్ప యిక్కట్ల పాలయ్యారు. ఆ ముగ్గుర్నీ యీ హంతకులు చంపి, వారి నగలూ గుర్రాలూ దొంగలించ బోయేంతలో, ఒక సింహాలమంద అక్కడికి వచ్చి పడింది. ఈ హంతకులు ఆ ప్రదేశం నుంచి పారి పోతూ కాపలాసైనికులకు దొరికారు. మహా మంత్రుల పుత్ర మిత్రుల శవాల కోసం, సైనికులు కొండప్రాంత మంతా గాలిస్తు న్నారు. దొరికితే, ఆ సంగతి వెంటనే తెలియ బరచ బడుతుంది," అని చెప్పాడు.

"మీ మహారాజుగారు యిదంతా నోటి మాటగా చెప్పమన్నారా? లిఖిత పత్రం ఏమీలేదా?" అన్నాడు గంగాధరుడు.

"మహారాజుగారు యీదారుణ విషయం రాయ ప్రయత్నించారు గాని, వారికి చేయి ఆడలేదు. ఆ కారణంగా, వారు రాయ దలచుకున్న విషయం నాకు చెప్పి తమకు తెలియ బరచమన్నారు," అన్నాడు దూత.

అంతవరకూ కదంబరాజ దూత చెపు తున్నదంతా శ్రద్ధగా ఆలకించిన శతభానుడు





సింహాసనం మీది నుంచి లేస్తూ, "సరే, యిక మీరు వెళ్ళిపోవచ్చు. ఈ హంతకుల్ని విచారించి తగినశిక్ష మేమే విధిస్తాం," అన్నాడు.

ఆ మాటలు వింటూనే ఉగ్రసేనుడి దూతలు కలవరపడిపోయి, ఒకళ్ళ ముఖాల కేసి ఒకరు చూసుకున్నారు. ఈసారి దూతల్లో మరొకడు ముందుకు వచ్చి, "మహారాజా! క్షమించాలి. పితృ భ్రాతృ హంతకులైన వీళ్ళిద్దరికీ లోగడే యావజ్జీవ కారాగార శిక్ష విధించబడింది. వీళ్ళు ఖైదు నుంచి పారిపోయి, తిరిగి యీ కొత్త హత్యలకు ఒడిగట్టారు. మా మహారాజుగారి ఆజ్ఞ ఏమిటంటే, యీ హంతకు లిద్దర్నీ, కదంబ కుంతలదేశాల సరిహద్దు మీదవున్న మహా వృక్షానికి దేనికైనా వేలాడకట్టి ఉరిదీయమని. ఆ కార్యం మేము తిరిగివెళ్ళేటప్పుడు పూర్తిచేస్తాం, యిక సెలవు!" అన్నాడు.

ఉగ్రసేనుడి దూతలు నలుగురూ, ఖైదీ లిద్దర్నీ సమీపించి, వాళ్ళను చేతి కర్రలతో పొడిచి వెనక్కు తిప్పబోయారు. ఖైదీల్లో ధూమకుడనే వాడు రోషంగా కళ్ళెర్ర చేసి, "ఛీ, దుర్మార్గుల్లారా!" అంటూ యీసడించాడు. సోమకుడు కర్రదెబ్బ తిని ఉలకలేదు, పలకలేదు. అతడి ముఖం మీద ఎలాంటి బాధా ప్రస్ఫుటంకాలేదు.

దూతల్లో ఒకడు వాళ్ళిద్దరికీ చేరువగా వెళ్ళి, "జాగ్రత్త! మీ పెళ్ళాంబిడ్డల మాట మరిచి పోకండి!" అన్నాడు పళ్ళు కొరుకుతూ.

దూతలు ఖైదీలతో సభామందిరం నుంచి బయిటికి వెళ్ళిపోయారు. రాజు శతభానుడు వాళ్ళు పోయిన ద్వారం కేసి సాలోచనగా చూస్తూ, "అమాత్యా! హంతకుడు ఉగ్రసేనుడే నన్న అనుమానం నాకు దృఢపడుతున్నది. ఏమిటీ, అతడి యీ కపట నాటకమంతా!" అన్నాడు.

"ఈ కపట నాటకం చాటున, మహా భయంకరమైన కుట్ర ఏదో వున్నదన్న అనుమానం నాకు కలుగుతున్నది, మహారాజా!






అంతే కాదు, శశికాంతుడు సజీవుడే అని కూడా నేను భావిస్తున్నాను," అన్నాడు మంత్రి గంగాధరుడు.

"శశికాంతుడు క్షేమంగా తిరిగి రావాలని నేను కోరుకుంటున్నాను. ఉగ్రసేనుడికి, మన భద్రుడు గాయపడి నగరం చేరినట్టు తెలియదులావుంది. అతడి దూతల మాటల వల్ల మనవాళ్ళు ముగ్గురూ అరణ్యంలో మరణించారని వాళ్ళు అభిప్రాయపడుతున్నట్టు కనబడుతున్నది," అన్నాడు శతభానుడు.

"అతడి దూతలు మన నగరం చేరక ముందు, అందరూ అలాగే అనుకుని వుంటారు. ఇప్పుడు నగరప్రజలు చెప్పుకునే మాటల వల్ల, భద్రుడు యిక్కడికి చేరినట్టు దూతలు గ్రహిస్తారు. వెన్నులో తగిలిన బాణం శస్త్రం చేసి బయిటికి లాగగానే, అతడు మరణించాడని, పుకారు వేయిస్తాను," అన్నాడు గంగాధరుడు.

"ఇందు వల్ల కలిగే మేలేమిటి?" అన్నాడు శతభానుడు.

"ఈ పుకారు, అతడి దూతల ద్వారా గాని, మరొకవిధంగా గాని ఉగ్రసేనుడికి చేరుతుంది. ఆ విధంగా, అరణ్యంలో జరిగిన వాస్తవం ఏమిటో మనకు తెలిసే అవకాశం లేదని, అతడు ధీమాగావుంటాడు. అది మనకు చాలా మేలు చేకూరుస్తుంది, మహారాజా! ఈ హంతకులనబడే ఖైదీలిద్దరి సంగతీ తెలుసుకోవాలి. అదంతా నేను చూస్తాను. ఇప్పటికే చాలా పొద్దు పోయింది, తమరు శయనాగారానికి వెళ్ళండి," అంటూ మంత్రి గంగాధరుడు రాజుకు నమస్కరించి, సభామందిరాన్నుంచి బయిటికి వచ్చి, అక్కడ కాపలావున్న ఒక భటుణ్ణి పిలిచి, వాళ్ళ నాయకుణ్ణి తీసుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఉగ్రసేనుడి దూతలు రాజప్రాసాదపు ఆవరణ దాటి, నగరంలో ప్రవేశించారు.






రాజవీధిన వున్న ఒక చెట్టు కింద నాలుగు గుర్రాలు కట్టివేయబడి వున్నవి. దూతలు వాటిని అధిరోహించి, ఖైదీలైన ధూమక సోమకుల నడుముకు పొడవాటి తాళ్ళుకట్టి, వాటి కొసలను గుర్రాల జీనులకు బిగించి బయలుదేరారు.

ఆ సరికి రాత్రి బాగా పొద్దుపోయింది. నగరం సద్దు మణిగింది. ఏవో అవసర కార్యాల మీద పోయే ఒకరిద్దరు పౌరులూ, గస్తీభటులూ తప్ప, దూతలకు ఎవరూ దారిలో ఎదురుపడలేదు. వాళ్ళకు భద్రుడు బతికి వున్నాడా, లేక మరణించాడా అన్న సంగతి తెలుసుకోవాలని చాలా ఆదుర్దాగా వున్నది. తాము కదంబరాజు దగ్గిర నుంచి బయలు దేరేటప్పుడు, బాణందెబ్బ తిని గాయపడిన వాడు, అరణ్యంలో ఎక్కడో గుర్రంమీంచి జారి కిందపడి మరణించి వుంటాడని భావించారు. కాని, కుంతల నగరం చేరిన తరవాత నగర పౌరులు మాట్లాడుకునే దాన్ని బట్టి, ఆ గాయపడ్డ వాడు రాజప్రాసాదం చేరాడు. వాడు మాట్లాడే స్థితిలో వుంటే, యదార్థం బయట పడిపోతుంది...

దూతలు నగరద్వారం చేరి, అక్కడ కాపలా వాళ్ళకు నగరరక్షకుడిచ్చిన అనుమతి పత్రం చూపి, "పాపం, మంత్రి కుమారుడి స్నేహితు డొకడు గాయపడి నగరం చేరాడట. వెన్నులో గుచ్చుకున్న బాణంతో, అత డింత దూరం గుర్రం మీద రావటం ఆశ్చర్యంగా వుంది!" అన్నారు.

"ఆ గాయపడ్డ యువకుడి పేరు భద్రుడు, ఉక్కు ముక్కలా వుండేవాడు. ఏం లాభం! శస్త్రం చేసి బాణం బయిటికి లాగగానే, ఆ వున్న కాస్త కొనవూపిరీ పోయింది," అన్నారు కాపలాభటులు.

"అయ్యో పాపం!" అంటూ దూతలు లేని జాలి కనబరిచి, నగరద్వారం దాటి అరణ్య మార్గం పట్టారు.





సమ్మోహితుల్ని చేశాం. ఇందుకు మన రాజుగారు మన నెంతగా సత్కరిస్తారో, ఎన్నెన్ని మడిమాన్యాలిస్తారో వూహించుకో," అంటూ దూత పెద్దగా నవ్వాడు.

అతడి నవ్వు ముగిసేలోపల అంతకంటె పెద్దగా వికృతంగా దారిపక్క చెట్ల చాటు నుంచి మరొక నవ్వు వినిపించింది. దూతలు ముగ్గురూ నివ్వెరపోయి, ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశారు. అక్కడెవరూ వారికి కనిపించ లేదు, అలికిడైన జాడ కూడా లేదు. గుడ్డి వెన్నెలలో అరణ్యం మహా భయంకరంగా వున్నది. ఏవేవో వింత ధ్వనులు వినిపిస్తున్నాయి.

"మన సంతోషంలో మనం యింత వరకూ పరిసరాలను గమనించ లేదు సుమా! ఈ అరణ్యం దొంగలకూ, దారి దోపిడిగాళ్ళకే గాక, భయంకరమైన పిశాచాలకూ్కడా నిలయం అని విన్నాం. ఇక నోళ్ళు మూసుకుని జాగ్రత్తగా గుర్రాలను నడపండి. ధూమక సోమకులు గుర్రాల వెంట వస్తూనే వున్నారా?" అంటూ దూతల్లో ఒకడు వెనక్కు తిరిగి చూశాడు.

ఆ మరుక్షణం దూతల మీద చెట్లకొమ్మల నుంచి కణకణలాడే బొగ్గులు వానజల్లులా కురిసినై. ఆ నిప్పుకణాలు మీద పడగానే

"మన మహారాజూ, మంత్రీ పథకం వేశారంటే దానికి తిరుగుండదు. మంత్రిగారు సామాన్యుడా? నూలుపోగుతో ఏనుగును బంధించగలడు," అన్నా డొక దూత.

"చచ్చిన వాళ్ళు చచ్చారు ; పథకాలూ, తంత్రాలూ అల్లేవాళ్ళు అల్లుతున్నారు. వాళ్ళ మాట కేం గాని, మధ్య మనం అదృష్టవంతులం," అన్నాడు మరొక దూత.

"ఏమిటబ్బా, అంత అదృష్టం?" అన్నాడు మొదటి దూత.

"మనం వచ్చిన పని మహ చక్కగా, మహా చాకచక్యంగా నిర్వహించాం. మన వాగ్జాలంతో యీ దేశపు రాజునూ, మంత్రినీ

గుర్రాలు బెదిరి పరిగెత్తసాగినై. దూతల్లో ఇద్దరి దుస్తులు నిప్పంటుకుని భగ్గుమన్నవి.

"కొరివిదయ్యాలు! కొరివిదయ్యాలు!". అంటూ దూతలు నలుగురూ ఒక్కసారిగా భీతితో కేకలుపెట్టారు. కళ్ళాలు లాగి, పరిగెత్తే గుర్రాలను ఆపాలనే ప్రయత్నం వాళ్ళేమీ చెయ్యలేదు. అవి పెద్దగా సకిలిస్తూ దారీతెన్నూలేకుండా అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తసాగినై. ధూమక సోమకులు పడుతూ లేస్తూ, వాటి వెనక పరిగెత్తసాగారు,

కొద్ది సేపటి తరవాత గుర్రాలు అలిసిపోయి రౌతుల స్వాధీనానికి వచ్చినై. దూతల్లో ఒకడు ధూమక సోమకులు తమ వెంటనే వుండటం గమనించి తృప్తిగా నిట్టూర్చి, "మనం ఎంత అదృష్టవంతులం! ఎంత పెద్ద ప్రమాదాన్నుంచి బయటపడ్డాం. కొరివిదయ్యం పట్టునుంచి బయటపడ్డ వాణ్ణి, కాలుడు కూడా ఏమీ చెయ్యలేడని సామెత గదా!" అన్నాడు.

"ఆ సామెతల కేంలే, మనం దారి తప్పాం," అన్నా డొక దూత విసుగ్గా.

"దారి తప్పితే నేం, ప్రాణాలు దక్కినై. ఆ కనబడే కొండ మనరాజ్యంలోదే కదా?" అన్నాడు మరొక దూత.

"అవును, మీ రాజ్యంలోదే! మీరు కదంబరాజుగారి దూతలా? మంచిది,



నా వెంట రండి. నేను కుంతలదేశ సరిహద్దు కాపలాసైనికుణ్ణి. కుంతల, కదంబ దేశాల సరిహద్దు మీద వున్నదే, ఆ కనబడే మహావృక్షం! మీరు దానికింద నిలబడి చూస్తే, పోవలసిన దారి సూటిగా కనబడుతుంది," అని చెప్పాడు సైనికుడొకడు.

సైనికుడు ముందుండి దారితీయగా, దూతలు ఎక్కడలేని సంతోషంతో తమ గుర్రాలను వెనకగా నడిపి అతడు చెప్పిన మహావృక్షం కిందికి వెళ్ళారు. అక్కడ మరొక కాపలాసైనికుడు కత్తి చేతబట్టుకుని నిలబడి వున్నాడు.

"అక్కడ తెల్లగా పాములా మెలికలు తిరుగుతూ పోతున్నదేమిటి? కొండవాగా?" అని అడిగాడు ఒక దూత. కాపలా సైనికుడు ఆ ప్రశ్నకు జవాబిచ్చేంతలో, చెట్టుకొమ్మల్లో ఏదో శబ్దం అయింది. దూతలు భయంతో కంపించిపోతూ, తలలు ఎత్తి, "ఏవో కొండచిలువలలా వున్నై!" అంటూ గుర్రాలను అదిలించారు. అంతలో బలమైన రెండు ఉచ్చుతాళ్ళు విసురుగా వచ్చి, దూతల్లో ఇద్దరి కంఠాలకు బిగుసుకున్నై. వాళ్ళెక్కి వున్న గుర్రాలు రెండూ ముందుకు పరిగెత్తినై. కత్తి చేతబట్టుకుని వున్న కాపలా సైనికుడు ధూమక సోమకుల నడుముకు బిగించి వున్న తాళ్ళను ఒక్క వేటుతో నరికివేశాడు.

మిగిలిన ఇద్దరు దూతలూ భీతితో అరుస్తూ, గుర్రాలను అదిలించి కొండవాగు కేసి దౌడుతీశారు. కంఠాలకు ఉచ్చులు బిగుసుకున్న దూత లిద్దరూ ఒక్కసారి కీచుమంటూ అరిచి, కొమ్మలకు వేళ్ళాడ సాగారు.

"ఆ పారిపోయే ఇద్దర్నీ వాగు చేరక ముందే పడగొట్టండి!" అన్న కేక వినిపించింది. ఆ వెంటనే చెట్లచాటు నుంచి బయటికి వచ్చిన కుంతలసైనికులు, దూతల కేసి రివ్వురివ్వుమంటూ బాణాలు వదలసాగారు. —(ఇంకావుంది)





# దారికి వచ్చిన భార్య

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే శ్మశానం కేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, యుక్తి తెలియని కారణం చేత నీవు ఇలా కష్టపడుతున్నావేమో నని నాకు అనుమానంగా ఉన్నది. పూర్వం గుహచంద్రు డనేవాడు యుక్తి చేతనే గదా తన భార్యను దారికి తెచ్చుకున్నాడు! శ్రమ తెలియకుండా నీ కతని కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

"పూర్వం పాటలీపుత్ర నగరంలో ధనగుప్తు డనే గొప్ప వర్తకు డుండేవాడు. అతని భార్య చంద్రప్రభ గర్భవతిగా ఉండి, ఒక చక్కని చుక్కలాటి కుమార్తెను కన్నది. ఆ శిశువు భూమి మీద పడుతూనే దివ్యమైన కాంతులు పురిటింట వెదజల్లుతూ, లేచి కూర్చుని, స్పష్టంగా మాట్లాడ

## బేతాళ కథలు




నారంభించింది. పురిటింట ఉన్న స్త్రీలందరూ ఇది చూసి దిగ్భ్రమ చెంది, ధనగుప్తుడికి కబురుచేశారు.

ధనగుప్తుడు వచ్చి ఆ వింత స్వయంగా చూసి, శిశువు ముందు సాష్టాంగ పడి, "దేవీ, నా గర్భవాసాన పుట్టిన నువ్వెవరు?" అని అడిగాడు.

"నే నెవరైతే నేం? నేను నీ యింటనే పెరిగి, నీకు శుభం చేకూర్చుతాను. నన్ను ఎన్నడూ ఒకరి కిచ్చి పెళ్ళి చెయ్యకు," అన్నది ఆ శిశువు.

ధనగుప్తుడు అలాగే నని, తనకు పుట్టిన బిడ్డ చనిపోయినట్టు లోకానికి ప్రకటించి, సోమప్రభ అని పేరు పెట్టి, తన ఇంట ఆమెను రహస్యంగా పెంచి పెద్దదానిని చేశాడు. కాలక్రమాన యుక్తవయస్కురాలై, సోమప్రభ లోకాతీత సౌందర్యవతిగా తయారయింది.

ఇంతలో వసంతోత్సవం వచ్చింది. సోమప్రభ తమ ఇంటి పైభాగం నుంచి వేడుకలు గమనిస్తున్నది.

ఆ సమయంలో గుహచంద్రు డనే వైశ్య యువకుడు ఆమెను చూసి, మోహావేశంతో వెంటనే మూర్ఛ పోయాడు. తిరిగి స్పృహ వచ్చాక అతను ఇంటికి వెళ్ళి, విరహబాధతో తీసుకో సాగాడు.

అతని తండ్రి గుహసేనుడు తన కొడుకుకు వచ్చిన జబ్బేమిటో తెలియక తికమక పడ్డాడు. అప్పుడు గుహచంద్రుడి మిత్రులు ఆయనతో జరిగిన సంగతేమిటో చెప్పారు.

అప్పుడు గుహసేనుడు ధనగుప్తుడి ఇంటికి వెళ్ళి, మంచిగానే, "మీ అమ్మాయిని నా కొడుకు కిచ్చి పెళ్ళిచెయ్య," అని అడిగాడు.

"నీ కేమైనా మతిపోయిందా ఏమిటి? నాకు కూతురెక్కడ ఉన్నది?" అన్నాడు ధనగుప్తుడు.

మంచిగా పని జరగదని తెలుసుకుని గుహసేనుడు రాజును చూడబోయాడు. ఆయన రాజుకు లోగడ అనేక విధాల సహాయం చేసి ఉన్నవాడు కావటం చేత, తాను కోరితే రాజు సహాయం చెయ్యక పోడని అనుకున్నాడు.

ఆయన రాజు కొక రత్నాన్ని కానుక ఇచ్చి, "మహారాజా, తమ వల్ల ఒక చిన్న సహాయం కావాలి," అనగానే రాజు తప్పక చేస్తాను అదేమిటో చెప్పమన్నాడు.

గుహసేనుడు రాజుతో, ధనగుప్తుడి కొక కుమార్తె ఉన్నదనీ, తన కొడుకు ఆ కన్యను మోహించాడనీ, తాను వెళ్ళి కన్య నిమ్మని అడిగితే ధనగుప్తుడు తనకు కూతురే లేదంటున్నాడనీ చెప్పాడు.

రాజు గుహసేనుడి వెంట కొంత సేన నిచ్చి, "ధనగుప్తుడి కుమార్తెను బలాత్కారంగా తెచ్చి, నీ కొడుక్కు చేసుకో," అన్నాడు. గుహసేనుడు అట్టహాసంగా సేనను వెంట బెట్టుకుని వెళ్ళి ధనగుప్తుడి ఇంటిని ముట్టడించాడు.

తన మూలంగా తన తండ్రికి పెద్ద ఆపద వచ్చి పడటం చూసి సోమప్రభ ధనగుప్తుడితో, "నాన్నా, నా కోసం ఎందుకిన్ని చిక్కులు పడతావు? నన్నా వైశ్య కుమారుడి కిచ్చి పెళ్ళి చెయ్యి, కాని నేను





నా భర్తతో కాపరం చెయ్యాలని మాత్రం నీ విద్యుంకుడితో చెప్పు," అన్నది.

ధనగుప్తుడు గుహసేనుణ్ణి పిలిపించి, "నా కుమార్తెను నీ కొడుకు కిచ్చి పెళ్ళి చేస్తాను. కాని ఆమె నీ కొడుకుతో కాపరం మటుకు చెయ్యదు," అన్నాడు.

పెళ్ళి చేసుకున్నది కాపరం చెయ్యకుండా ఎలా ఉంటుంది లెమ్మనుకుని, గుహసేనుడు, ధనగుప్తుడు చెప్పిన నియమానికి లోబడి, తన కుమారుడికి సోమప్రభను చేసుకుని, కోడలిని తన ఇంటికి తెచ్చుకున్నాడు. అత్తవారింటికి వచ్చిన రోజు రాత్రి సోమప్రభ, ఎవరెన్ని చెప్పినా తన భర్తతో బాటు పడకగదిలో ప్రవేశించ నిరాకరించింది.

అప్పుడు గుహసేనుడు తన కొడుకుతో, "పెళ్ళి చేసుకున్న మనిషి కాపరం ఎలా చెయ్యకుండా ఉంటుంది? దాన్ని గదికి తీసుకుపో!" అని చెప్పాడు.

వెంటనే సోమప్రభ తన మామగారిని వేలితో బెదిరించింది. ఆ వేలు చూస్తూనే గుహసేనుడు బెదిరి, గుండె పగిలి, ప్రాణాలు వదిలాడు.

"ఇది మనిషి కాదు, మహామారి. నా ప్రారబ్ధం కొద్దీ ఇది నాకు భార్యగా దాపరించింది," అనుకుని గుహచంద్రుడు తన భార్య జోలికి పోక, భార్య ఉండి కూడా బ్రహ్మచర్యం అవలంబించి, వైరాగ్యంతో జీవిస్తూ, రోజూ బ్రాహ్మణులకు అన్నదానం చేస్తూ వచ్చాడు. సోమప్రభ ఆ వచ్చిన బ్రాహ్మణులకు మౌనంగా దక్షిణ తాంబూలాలిస్తూ ఉండేది.

ఇలా ఉండగా ఒకనా డొక ముసలి బ్రాహ్మణుడు గుహచంద్రుడి ఇంట భోజనం చేసి, సోమప్రభ చేతి నుంచి దక్షిణ తాంబూలం తీసుకుంటూ, ఆమె అలౌకిక సౌందర్యానికి ఆశ్చర్యపడ్డాడు. తరవాత ఆయన గుహచంద్రుడితో రహస్యంగా,

"నాయనా, ఆ అమ్మాయి నీ కేమవుతుంది?" అని అడిగాడు.

గుహచంద్రుడొక పెద్ద నిట్టూర్పు విడిచి, తన వివాహ కథ అంతా ఆ ముసలి బ్రాహ్మణుడికి చెప్పాడు. అంతా విని ఆ వృద్ధుడు, "నాయనా, ఈ రాత్రి కూడా నన్ను మీ ఇంటనే భోజనం చేసి, ఇక్కడనే పడుకోనియ్యి. నీ కొక చిత్రం చూపించి, నీ సమస్య పరిష్కారమయేటట్టు చేస్తాను," అని చెప్పాడు.

అందుకు గుహచంద్రుడు సమ్మతించి, ఆ రాత్రి ఆ బ్రాహ్మణుణ్ణి తన సమీపంలోనే పడుకోనిచ్చాడు.

ఒక రాత్రి వేళ ఇంట్లో అందరూ గాఢ నిద్రలో ఉన్న సమయంలో, సోమప్రభ ఇంటి నుంచి బయలుదేరింది. బ్రాహ్మణుడు గుహచంద్రుణ్ణి నిద్రలేపి, "నా వెంట రా!" అన్నాడు. ఆయన గుహచంద్రుణ్ణి తన యోగశక్తి చేత ఒక తుమ్మెదగా మార్చి, తాను కూడా తుమ్మెద రూపం ధరించాడు. రెండు తుమ్మెదలూ సోమప్రభను వెన్నంటి వెళ్ళాయి.

సోమప్రభ చాలా దూరం వెళ్ళి, ఒక పెద్ద మర్రిచెట్టు కిందికి చేరింది. అక్కడ చక్కని సంగీతమూ, దివ్యమైన గానమూ వినిపిస్తున్నాయి. ఒక దేవతాస్త్రీ, సోమ





ప్రభను పోలినదే, ఒక గొప్ప ఆసనం మీద కూర్చుని ఉన్నది. సోమప్రభ వెళ్ళి, ఆ ఆసనం మీదనే, ఆ దేవతాస్త్రీ పక్కన ఆసీనురాలయింది. తరవాత ఆ ఇద్దరు స్త్రీలూ దివ్యమైన ఆహారం తిని, దివ్యమైన పానీయాలు తాగారు.

తరవాత సోమప్రభ రెండవ స్త్రీతో, "అక్కా, ఇవాళ మా యింటికి శక్తిమంతుడైన ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. ఆయనను గురించి ఆలోచిస్తే నాకేదో భయంగా ఉన్నది. ఎందుకైనా మంచిది, నేను త్వరగా తిరిగి పోతాను," అంటూ లేచి, తన ఇంటికి బయలుదేరింది.

తుమ్మెద రూపంలో ఉన్న గుహచంద్రుడిదంతా కళ్ళారా చూసి, చెవులారా విన్నాడు. సోమప్రభ ఇంటికి బయలుదేరగానే, తుమ్మెదల రూపంలో ఉన్న బ్రాహ్మణుడూ, గుహచంద్రుడూ శీఘ్రంగా ఎగురుతూ ఇంటికి తిరిగివచ్చి, తమ సహజ రూపాలు ధరించి, ఏమీ ఎరగనట్టు పడుకున్నారు. సోమప్రభ కూడా తిరిగివచ్చింది.

బ్రాహ్మణుడు గుహచంద్రుడితో, "చూశావు గదా, నాయనా? నీ భార్య మానవస్త్రీ కాదు, దేవతాస్త్రీ. ఆ సంగతి ఆమెకు తెలుసును. ఏ శాప ఫలితంగానో ఆమె మానవజన్మ ఎత్తినప్పటికీ తనవారితో ఆమెకు సంబంధం తెగలేదు. అలాటి స్త్రీ మానవుడితో సంసారం చెయ్యటానికి ఒప్పుకుంటుందా? నీకొక యుక్తి చెబుతాను. అలా చేశావంటే నీ భార్య నీతో కాపరం చెయ్యటానికి సిద్ధపడుతుంది," అని చెప్పి, గుహచంద్రుడికొక తంత్రం తెలిపి, తన దారిన తాను వెళ్ళాడు.

మర్నాడు చీకటి పడ్డాక గుహచంద్రుడి ఇంటికి చక్కగా అలంకరించుకుని ఒక వేశ్య వచ్చింది. గుహచంద్రుడామెను తన గదికి తీసుకుపోయి, ఆమెతో సరససల్లాపాలాడసాగాడు.

ఇదంతా సోమప్రభ చూసింది. ఆమె తన భర్తను ఇవతలికి పిలిపించి, "అది ఎవతె?" అని అడిగింది.

"ఆమె ఒక వేశ్య. నన్ను అమితంగా ప్రేమించింది. నన్ను తన ఇంటికి తీసుకు పోవటానికి వచ్చింది. నేను పోతున్నాను," అని గుహచంద్రుడు అబద్ధాలాడాడు.

"కట్టుకున్న దాన్ని నేనుండగా మిమ్మల్ని ప్రేమించటానికి అది ఎవతె? మీరు వెళ్ళటానికి వీలులేదు," అన్నది సోమప్రభ.

అది మొదలు ఆమె తన భర్తతో సక్రమంగా కాపరం చేస్తూ, గుహచంద్రుడికి అంతులేని ఆనందం కలిగించింది.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, దేవతాస్త్రీ అయి ఉండి కూడా సోమప్రభ సాధారణ స్త్రీ లాగా అసూయ చెందటానికి కారణ మేమిటి? ఆమె సాధారణ మానవ స్త్రీ కాదని నిరూపించిన వృద్ధ బ్రాహ్మణుడే ఆమెకు ఈర్ష్యకలిగించే తంత్రం ఎందుకు చెప్పాడు? అది ఆమె పైన ఎలా పారింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవతా స్త్రీలు మానవులను ప్రేమించటం అసంభవం కాదు. అలా జరిగిన సందర్భా లెన్నయినా ఉన్నాయి. సోమప్రభ గుహచంద్రుణ్ణి ప్రేమించని కారణం చేతనే అతనితో కాపరం చెయ్యలేదు. అంతేగాని, తాను దేవతా స్త్రీ అయి ఉన్నందు వల్ల కాదు. ఇక ఈర్ష్య మాట. ప్రేమ సాధ్యమైన చోట ఈర్ష్య కూడా సాధ్యమే. సోమప్రభలో ప్రేమ లోపించటం చేత కనీసం ఈర్ష్య అయినా కలగటానికి బ్రాహ్మణుడు యుక్తి పన్నాడు, ఆ యుక్తి పారింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






# విడాకులు

సృష్ట్యాదిలో అరణి అనే ఒక ఋషి ఉండేవాడు. ఆయనకు ఒక వింత ఆలోచన కలిగింది: సృష్టిలో ఇన్ని రకాల జీవరాసు లెందుకు? మానవు లుంటే చాలదా?

అరణి బ్రహ్మను గూర్చి తపస్సు చేసి, ఇతర ప్రాణులను మనుషులుగా మార్చే వరం పొందాడు. ఆయన తపస్సు నుంచి తిరిగి వస్తూ, ఒక లేడి భయపడి పరిగెత్తి పోతూ వుండటమూ, ఒక పులి గాండ్రిస్తూ దానిని తరుముతూ ఉండటమూ చూశాడు. ఆయన వెంటనే తన వరప్రభావం చేత ఆ లేడిని ఒక ఆడమనిషి గానూ, పులిని ఒక మగమనిషి గానూ మార్చేశాడు.

మగవాడికి ఆడదాన్ని చూడగానే మోహం పుట్టుకొచ్చింది. దాన్నే ఆ మగవాడు ప్రేమ అనుకుని, ఆ స్త్రీకి తన ప్రేమను గురించి వర్ణించి చెప్పాడు. అతని ప్రేమాలాపాలు విని ఆ స్త్రీ కూడా ఎంతో ఆనందం పొందింది.

వారిద్దరి మధ్యా ఏర్పడిన ఈ అన్యోన్యతకు అరణి చాలా సంతోషించి, వారిద్దరినీ వివాహవిధి ద్వారా భార్యాభర్తలు చేశాడు. వారు అరణ్యం లోనే ఒక ఇల్లు కట్టుకుని కాపురం మొదలెట్టారు.

భర్త అరణ్యంలోకి వెళ్ళి జంతువులను వేటాడి, వాటి మాంసం తెచ్చి తన భార్యను తినమనేవాడు. భార్యకు మాంసాహారం అంటే గిట్టేది కాదు; ఆమె పళ్ళూ, కాయలూ తినేది. భార్య మాంసం తినక పోవటం భర్తకు నచ్చలేదు, భర్త నిర్దయుగా జంతువులను చంపటం భార్యకి నచ్చలేదు. ఆమె అరణ్యంలోని లేళ్ళనూ, పక్షులనూ చేరదీసి, పెంచుతూండేది. అరణి వారికి సమీపంలోనే ఆశ్రమం నిర్మించుకుని వారి విషయాలన్నీ గమనిస్తూ ఉండేవాడు.

రానురాను భార్యాభర్తల మధ్య విభేదాలు జాస్తి అయాయి. భార్య పెంచే

రవిరామ్

లేళ్ళనూ, పక్షులనూ భర్త చంపి తినేవాడు. భార్య చాలా బాధపడేది. భర్త పైన ఆమెకు కోపం కూడా వచ్చేది. తన లాగే పళ్ళూ, కాయలూ తినరాదా అని ఆమె భర్త నడిగేది. "నా లాగే నువు కూడా మాంసం తిను," అని భర్త భార్యను శాసించేవాడు.

క్రమంగా ఇద్దరికీ ఒకరంటే ఒకరికి పడకుండా పోయింది. అయినా వాళ్ళు అలాగే కాపరం చేస్తూ, అనేకమంది మగ సంతానాన్నీ, ఆడసంతానాన్నీ కన్నారు. వారిలో కొందరికి తండ్రిగుణాలూ, పోలికలూ, మరి కొందరికి తల్లిగుణాలూ, పోలికలూ వచ్చాయి.

భర్త భార్యను తరుచుగా చావగొట్టేవాడు, రకరకాలుగా హింస పెట్టేవాడు. ఒకసారి అతనికి భార్య మీద పట్టరాని ఆగ్రహం వచ్చి, ఆమెను మృగాన్ని చంపినట్టు చంపటానికి విల్లెక్కుపెట్టాడు. భార్య భయపడి పారిపోయింది. భర్త ఆమెను తరుముకుంటూ వెళ్ళాడు. భార్య ఆరణి ఆశ్రమంలోకి జొరబడి దాక్కున్నది. ఆమె వెనకనే భర్త కూడా అక్కడికి చేరాడు.

ఆరణి అతన్ని శాంతపరచి, "మీరు ఒకరినొకరు ద్వేషిస్తూ ఏం కాపరం చేస్తారు? విడిపోయి ఎవరిదారిన వారు వెళ్ళి పొండి?" అని చెప్పి, పచ్చగా నవనవలాడే రెండు ఆకులు తెచ్చి భార్యా భర్తలకు చెరొకటీ ఇచ్చి, "వీటిని తీసుకుని మీరిద్దరూ చెరొక దిక్కుగానూ వెళ్ళి పొండి. వీటి పసరు ఇగిరి, అవి ఎండుటాకులుగా మారేసరికి, మీ కిద్దరికీ విముక్తి కలుగుతుంది," అన్నాడు.

ఆ భార్యాభర్తలు ఆ ఆకులు పట్టుకుని చెరొక దిక్కుగా వెళ్ళిపోయారు. ఆ ఆకులు ఎండిపోయే సమయానికి మగవాడు పులిగా మారాడు, ఆడది లేడిగా మారింది.

వాళ్ళ పిల్లలకు మాత్రం పుట్టుకతో వచ్చిన పులిగుణాలూ, లేడిగుణాలూ కల కాలం అలాగే నిలిచిపోయాయి.





# విషము పరీక్ష

ఒకసారి మళయాళ రాజు అక్బరుపాదు షాకు ఈ విధంగా వర్తమానం చేశాడు:

"మీరు సాధ్యమైనంత త్వరలో ఈ నాలుగు వస్తువులనూ మాకు పంపాలి: ఉత్తమజన్మ గల హీనవ్యక్తి; నీచజన్మ గల ఉత్తమ వ్యక్తి; ఒక ఊరకుక్క; సింహాసనం అధిష్ఠించిన గాడిద. సాధ్యమైనంత త్వరలో ఈ నాలుగింటినీ మాకు పంపకపోయినట్టయితే మన మధ్య యుద్ధం జరగటానికి సిద్ధంగా ఉండగలరు."

ఈ ఉత్తరం చూసుకుని అక్బరు దీర్ఘంగా యోచించాడు. మళయాళరాజు కోరినవి దొరకటం అసంభవం. అందుచేత యుద్ధం తప్పదని ఆయనకు తోచింది.

ఆయన బీర్బలుకు సంగతంతా చెప్పి, "నీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

బీర్బల్ కొంచెం ఆలోచించి, "ఈ వస్తువులు ఉన్నపాళంగా సంపాదించటం కష్టం. ఒక సంవత్సరం గడువు అడుగుతూ జవాబు పంపండి," అన్నాడు.

పాదుషా అలాగే చేసి, "ఈ కార్యభార మంతా నీ మీదనే పెడుతున్నాను. ఇది ఇతరుల వల్ల అయే పని కాదు," అన్నాడు.

"చిత్తం. దీని సంగతి నేనే చూస్తాను. ఇప్పటి నుంచే నన్నా పనిలో నియోగించండి, ఖర్చులకుగాను నాకొక లక్ష రూపాయ లిప్పించండి," అన్నాడు బీర్బల్.

పాదుషా మంజూరు చేసిన లక్షరూపాయలూ ఖజానా నుంచి తీసుకుని, షావుకారు వేషం ధరించి, మేలుజాతి అరబ్బీగుర్రం మీద బీర్బల్ మర్నాడే మళయాళానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.

అతను మళయాళ రాజధానిలో రాజ వీధిలో కొత్వాలు కచేరీకి ఎదురుగా ఉన్న మేలైన బంగళా అద్దెకు తీసుకుని, వడ్డీ వ్యాపారస్తుడుగా స్థిరపడ్డాడు.

బి. సూర్యనారాయణ

త్వరలోనే అతనికీ, కొత్వాలుకూ మంచి దోస్తీ అయింది. బీర్బల్ కొత్వాలును తరుచు తన ఇంటికి పిలిచి బ్రహ్మాండంగా విందులు చేస్తూ ఉండేవాడు. కొత్వాలు కూడా బీర్బలుకు అన్ని విధాల సహాయమూ చేస్తూ ఉండేవాడు. ఊరి కెవరైనా మంచి గాయకులూ, వర్తకులూ వచ్చినట్టయితే, కొత్వాలు వారిని బీర్బల్‌కు పరిచయం చేస్తూ ఉండేవాడు. బీర్బల్ వాళ్ళ చేత పాడించి, ఆడించి, వారికి మంచి సన్మానాలిచ్చి పంపుతూ ఉండేవాడు.

ఒకసారి రంభ అనే నర్తకి ఇలాగే బీర్బల్ వద్దకు వచ్చి ఆడి, పాడి,, అతన్నీ, అతని అతిథులనూ, తన విద్యాకౌశలంతో ఎంతో మెప్పించింది.

విద్యలకు తోడు ఆమె చాలా అందమైన యువతి. బీర్బల్ ఆమెకు ఘనంగా పారితోషికం ఇచ్చాడు. అది చూసి రంభ ఆశ్చర్యపోయి బీర్బలుతో, "అయ్యా, మీ వంటి వారు కటాక్షించి నన్ను పోషించే పక్షంలో, రెండేసి అణాల చొప్పున సంపాదించే ఈ వృత్తి మానేస్తాను. నన్ను అనుగ్రహించగల్రా?" అని అడిగింది.

ఆమెను తన ఉంపుడుకత్తెగా పెట్టుకోవటానికి అతను అంగీకరించి, "నిన్ను నేను



పోషిస్తాను. నీ కేది కావలిసినా నన్నడిగి తీసుకోవచ్చు," అన్నాడు.

అది మొదలు అతను ప్రతిరోజూ రంభ ఉండే ఇంటికి వెళ్ళివస్తూండేవాడు. వారిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండే వాళ్ళు. బీర్బల్ తన ఇంటికి వచ్చి వెళ్ళిపోతున్నప్పుడల్లా రంభ చాలా బాధపడేది.

కొంతకాలం గడిచింది. ఒకనాడు కొత్వాలు బీర్బలును, "మీ రెందుకు పెళ్ళాడారు కారు?" అని అడిగాడు.

"ఉత్తమవంశలో పుట్టిన స్త్రీ దొరికితే పెళ్ళాడటానికి నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు బీర్బల్.



కొన్నాళ్ళయాక కొత్వాలు బీర్బలుకు ఒక సంబంధం తెచ్చాడు. కన్య గొప్ప వంశానికి చెందినది. బీర్బల్ ఆమెను పెళ్ళాడటానికి ఒప్పుకున్నాడు. ఆమె పేరు మనోరమ. మనోరమకూ బీర్బల్‌కూ అత్యంత వైభవంగా పెళ్ళి జరిగింది.

బీర్బల్ తన భార్యలో ఆత్మాభిమానం ఉన్నదో లేదో తెలుసుకోవటానికి ఆమెను హీనంగా చూడసాగాడు. ఆమె సహించి ఊరుకున్నది. ఒకనాడతను అంగడిలో పుచ్చకాయ ఒకటి కొని, దానికి గాటు పెట్టి, ఒక మాసిన ఎర్రటి గుడ్డలో మూటగట్టి ఇంటికి తీసుకుపోయి, మనోరమతో,

"చూడు, నేను రాజకుమారుడి తల నరికి తెచ్చాను. దీన్ని ఈ పెట్టెలో పెట్టి తాళం వేస్తున్నాను. ఈ రహస్యం బయటపెట్టావంటే, నీ వీపు బద్దలవుతుంది," అని చెప్పి బయటికి వెళ్ళిపోయాడు.

తన భర్తను కొంత దూరం పోనిచ్చి మనోరమ ఇల్లెగిరి పోయేటట్టు కేకలు వెయ్యసాగింది. కొత్వాలు పరిగెత్తుకుంటూ వచ్చి, "ఏమిటి? ఏమయింది?" అని ఆమె నడిగాడు.

"ఇంకేం కావాలి? నువే నాకి పెళ్ళి చేసి నరకంలోకి తోశావు. నా మొగుడు వట్టి పశువు. నా బాధలు నీ కేమర్థమవుతాయి? ఆ పశువు రాజకుమారుడి తల నరికి తెచ్చి, ఈ పెట్టెలో భద్రంగా దాచాడు. ఈ సంగతి ఎవరితోనన్నా చెబితే నాకూ కూడా ఇదే గతి పడుతుందన్నాడు," అంటూ మనోరమ అంతా చెప్పేసింది.

ఈ వార్త వింటూనే కొత్వాలు, షావుకారును బంధించి తెమ్మని తన భటులను ఆజ్ఞాపించాడు. భటులు బీర్బలును వెతికి పట్టుకుని, అతని చేతులకు బేడీలు వేసి, కొత్వాలు వద్దకు ఈడ్చుకొచ్చారు.

"ఇదంతా ఏమిటి? నేనేం నేరం చేశాను?" అని బీర్బల్ కొత్వాలు నడిగాడు.

"నేరుముయ్యి, తుచ్ఛుడా! నువ్విలాటి వాడివని నాకు తెలియలేదు. త్వరలోనే తగిన శిక్ష అనుభవిస్తావులే!" అంటూ కొత్వాలు శీర్పలును రాజసమక్షానికి తీసుకుపోయి, "మహారాజా, ఈ పిశాచం రాజకుమారుణ్ణి హత్యచేసి, ఆ సంగతి బయట పెడితే తన భార్యను చంపేస్తానని బెదిరించాడు," అని ఫిర్యాదు చేశాడు.

రాజు కోపోద్రేకంతో, "దుర్మార్గుణ్ణి ఉరితియ్యండి!" అన్నాడు. ఆయన విచారణ లాంటి దేమీ జరపలేదు.

"ఈ దుర్మార్గుణ్ణి వధ్యస్థానానికి తీసుకుపదండి," అన్నాడు కొత్వాలు తన భటులతో.

శీర్పల్ దారిలో తన నౌకర్లను చూసి, "ఒరే, మీ రింటికి వెళ్ళి, అమ్మగారితో, నన్ను ఉరి తీయబోతున్నారని చెప్పండి. ఆమె ఏమనేదీ నాకు చెప్పండి," అన్నాడు.

నౌకర్లు మనోరమ దగ్గిరికి వెళ్ళి తమ యజమానికి ఉరిశిక్ష పడిందని చెప్పారు.

"పడితే పడనీ! చేసిన దానికి అనుభవించక తప్పుతుందా ఏమిటి? నేనేం చెయ్యగలను?" అన్నది మనోరమ.

నౌకర్లు తిరిగి వచ్చి మనోరమ అన్న మాటలు చెప్పారు. శీర్పల్ వాళ్ళను రంభ ఇంటికి వెళ్ళి, ఈ మాటే చెప్పమన్నాడు.



వాళ్ళు వెళ్ళాక అతను కొత్వాలుతో తనను రంభ ఇంటి మీదుగా తీసుకుపొమ్మని కోరాడు. కొత్వాలు సరే నన్నాడు.

కొత్వాలూ, భటులూ, శీర్పలును తన ఇంటి ముందుకు తెచ్చేసరికి రంభ వారి కోసం ఎదురు చూస్తున్నది. ఆమె కొత్వాలు ద్వారా శీర్పలు నేరం గురించి తెలుసుకుని, అతని చేతిలో రెండువందల రూపాయల సంచీ పెడుతూ, "మీ రొక్క గంటసేపు ఈ చెట్టు కింద ఆగి ఉండండి. అప్పటికి నేను రాకపోతే మీరు వెళ్ళిపోవచ్చు," అని చెప్పింది. కొత్వాలిందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.



రంభ తనకున్న దుస్తులలోనూ, ఆభరణాలలోనూ మేలైనవి ధరించి, రాజుగారిని చూడబోయింది. రాజు రంభలోని ఆకర్షణ చూసి దిమ్మరపోయి, "నీ కోరిక ఏమిటో నాతో నిర్భయంగా చెప్పుకోవచ్చు. తప్పక తీరుస్తాను," అన్నాడు.

షావుకారు చేసిన నేరాన్ని క్షమించి, ఆయన కిచ్చిన ఉరిశిక్ష ఉపసంహరించమని రంభ కోరింది. షావుకారు చేసిన నేరమేమిటో కూడా మరిచిపోయిన రాజు ఉరిశిక్షను రద్దుచేస్తూ పత్రం రాసి రంభ చేతి కిచ్చాడు. దాన్ని చూడగానే కొత్వాలు బీర్బల్‌ను విడిచిపెట్టాడు.

రంభ బీర్బలును తన ఇంటికి తీసుకుపోయింది. అక్కడ అతను ఆమె కళ్ళనుంచి ఏకధారగా కారే ఆనందాశ్రువులను తుడుస్తూ, "పిచ్చిదానా, ఎందుకు కంగారు పడ్డావు? ఇదంతా ఒక రాచకార్యం కోసం ఆడిన నాటకం. నేనిప్పుడు నా దేశానికి తిరిగి వెళ్ళాలి. మళ్ళీ త్వరలోనే యిక్కడికి తిరిగివచ్చి నిన్ను కూడా వెంటబెట్టుకుపోతాను," అన్నాడు.

అతను వెళ్ళిపోతానన్న మాటకు రంభ మీద పిడుగు పడ్డట్టయింది. కాని బీర్బల్ ఎంతో ప్రేమ చూపి, ఆమెను ఊరడించి, ధైర్యం చెప్పాడు.

రంభ వద్ద సెలవు పుచ్చుకుని అతను సపరివారంగా ఢిల్లీకి తిరిగి వచ్చి, "మళయాళరాజు కోరిన నాలుగింటినీ సాధించాను," అని అక్బరుకు తెలిపాడు.

"భేష్, సమస్య తీరిపోయింది. అవి ఎక్కడ ఉన్నాయి?" అన్నాడు అక్బరు, పరమానంద భరితుడై.

"మళయాళ రాజధానిలోనే ఉన్నాయి. తమరు నాకు అధికారం దయచేసినట్టయితే నేను మళయాళరాజు వద్దకు తమ దూతగా వెళ్ళి, వాటిని ఆయనకు చూపుతాను," అన్నాడు బీర్బల్.

అక్బరు ఆ ప్రకారమే ఉత్తరం రాసి, సంతకం చేసి, రాజముద్రతో సహా బీర్బలుకు ఇచ్చాడు.

బీర్బల్ పెద్ద పరివారాన్ని వెంటబెట్టుకుని అధికారరీత్యా మళయాళరాజు వద్దకు వెళ్ళి, అక్బరు పంపిన ఉత్తరాన్ని అందించాడు. మళయాళరాజు ఆ ఉత్తరం చదువుకుని, "ఆ నాలుగు వస్తువులూ ఎక్కడ?" అని అడిగాడు.

"ఇప్పుడే తమ ఎదట ఉంచుతాను," అంటూ బీర్బల్, రంభనూ, మనోరమనూ తీసుకురమ్మని తన నౌకరును పంపాడు. వాళ్ళు వచ్చారు.

అప్పుడు బీర్బల్ రాజుతో ఇలా అన్నాడు:

"నేను వడ్డీవ్యాపారి లాగా నటిస్తూ ఈ నగరంలో కొత్వాలుగారి కచేరీ కెదురుగా నివసించాను. కొత్వాలుగారికీ నాకూ మంచి స్నేహం ఏర్పడింది. వారే ఈ మనోరమ అనే ఆమెను నాకు భార్యగా కుదిర్చి, మా వివాహం జరిపించారు. ఆమె ఉత్తమ వంశంలో పుట్టినది. ఆమె ఉదారత పరీక్షించాలని నేను ఒకనాడు ఒక పుచ్చకాయను గుడ్డలో చుట్టి ఇంటికి తెచ్చి, అది రాజకుమారుడి తల అనీ, ఆ విషయం రహస్యంగా ఉంచమనీ చెప్పి, పనిమీద



వెళ్ళాను. వెంటనే ఆమె పెద్ద గడబిడ చేసి, నేను రాజకుమారుణ్ణి హత్య చేశానని కొత్వాలుగారికి ఫిర్యాదు చేసింది. తరవాత నాకు మరణశిక్ష కూడా విధించారు. ఆ వార్త విని ఈ నా భార్య నన్ను కాపాడుకునే ప్రయత్నం ఏమీ చెయ్యకపోగా, పీడ విరగడ అయిందని సంతోషించింది. కనుక ఈమె ఉత్తమజన్మ గల హీనురాలు."

రాజు ఆ మాటకు ఒప్పుకున్నాడు. బీర్బల్ తిరిగి ఇలా అన్నాడు:

"ఈ రంభ పాడీ, ఆడీ పొట్టపోసుకునేది. హీనజన్మ గలది. కాని ఈమె నన్ను వాస్తవంగా ప్రేమించింది. నా మరణశిక్ష

గురించి విని ఈమె ఎంతగానో దుఃఖించింది. చివర కామె నా శిక్షను రద్దు చేయించిన సంగతి తమకు తెలుసు. ఈమె హీనజన్మ గల ఉత్తమురాలు."

రాజు దానికి కూడా ఒప్పుకున్నాడు.

"ఇక మూడవది ఊరకుక్క. ఊర కుక్క మరెవరో కాదు, మన ఎదట ఉన్న ఈ కొత్వాలే," అన్నాడు బీర్బల్.

కొత్వాలు మండిపడుతూ, "నన్ను ఊరకుక్క అంటావా?" అన్నాడు.

"ఆ మాట రుజువు చెయ్యగలను. అది తిండి పెట్టేవాణ్ణి యజమానిగా భావించి తోక ఆడిస్తుంది. మీరు ఊరకుక్క లాగే నా వల్ల లాభం పొందినంత కాలమూ నాకు ఆప్తమిత్రుడల్లే నటించారు. మనోరమ ఫిర్యాదు చెయ్యగానే, నిజం ఆరాదియ్య కుండా, రాజుగా రివ్వబోయే బహుమతికి కక్కుర్తిపడి, నాకు వచ్చిన కష్టం గురించి కొంచెమైనా విచారం లేకుండా నాకు ద్రోహం చేశారు. ఇది ఊరకుక్క గుణం కాదా?" అన్నాడు బీర్బల్.

రాజు ఆ మాటకు ఒప్పుకున్నాడు.

"ఇక సింహాసనం అధిష్ఠించే గాడిద తమరే, మహారాజా. నేనన్నానని ఆగ్రహించ కండి. నేను రాజకుమారుణ్ణి హత్య చేశానని వింటూనే నాకు మరణదండన విధించారు గదా, ఆ నేరం నిజంగా జరిగిందో లేదో కూడా విచారించక పోవటం గాడిద లక్షణం కాదా?" అన్నాడు బీర్బల్.

బీర్బల్ మాటలలోని నిజాన్ని రాజు అంగీకరించక తప్పలేదు. ఆయన అతన్ని కొద్దిరోజులపాటు తన అతిథిగా ఉంచుకుని, కానుక లిచ్చి పంపేశాడు.

బీర్బల్ రంభనూ, మనోరమనూ కూడా వెంట బెట్టుకుని ఢిల్లీ వెళ్ళి, అక్బరుకు జరిగినదంతా చెప్పి, ఇంత విషమపరీక్షలో నెగ్గి నందుకు పాదుషా నుంచి ఒక మంచి జాగీరు బహుమానంగా పొందాడు.





# చేతగాని పని

పాపన్న గ్రామంలో ఉండే వెంకటాద్రికి పాపన్న అంటే వల్లమాలిన అభిమానం. ఒకనాడు వెంకటాద్రి ఇంటికి పొరుగు గ్రామం నుంచి కిష్టయ్య అనే అతను వస్తే, ఇద్దరూ పాపన్న గురించి చాలా సేపు మాట్లాడుకున్నారు. వెంకటాద్రి పాపన్న కథలు అనేకం చెప్పి, "మా పాపన్న అపూర్వమైన మనిషి. అతను తలుచుకుంటే చెయ్యలేని పని అంటూ లేదు. అందుకే ఆబాలగోపాలానికీ అతనంటే అంత అభిమానం," అన్నాడు.

"నీ దంతా మరీ బడాయి. పాపన్నకు చేతగాని పనులు లేకపోవటమేమిటి?" అన్నాడు కిష్టయ్య.

"ఏమిటది?" అన్నాడు వెంకటాద్రి.

"యాభైరూపాయలు పందెం కాస్తావా? అనేకమంది అవలీలగా చేసే పని మీ పాపన్న చెయ్యలేడు. చెయ్యలేడని నీ చేతనే ఒప్పిస్తాను. నువు ఒప్పుకోక పోతే నేను నీకు యాభైరూపాయ లిచ్చుకుంటాను, ఒప్పుకునే పక్షంలో నువు నాకు యాభైరూపాయ లిచ్చుకుంటావా?" అన్నాడు కిష్టయ్య.

"నువు చెప్పే పని అనేకమందికి సాధ్యమై పాపన్నకు చేతకాదని నేను ఒప్పుకునే పక్షంలో తప్పక యాభైరూపాయ లిచ్చుకుంటాను. ఆ పని ఏమిటో చెప్పు," అన్నాడు వెంకటాద్రి.

"మీ పాపన్నకు దొంగతనం చెయ్యటం చేతకా దంటాను. అవునంటావా, కాదంటావా?" అన్నాడు కిష్టయ్య.

వెంకటాద్రి వెలవెల పోయాడు. ఏం చెప్పటానికీ అతనికి నోరాడలేదు. కిష్టయ్య పెట్టిన పందెం గెలుచుకోవటానికి, పాపన్న దొంగతనం చెయ్యగలడని అతను తన నోట ఎలా అనగలడు? పాపన్న అంటే అతని



కెంతో అభిమానం, ఎంతో గురి! తన అంతరాత్మను చంపుకుని కిష్టయ్య అనమన్న మాట అని అతను యాభైరూపాయలూ గెల్చుకుంటే, రేపటి నుంచీ కిష్టయ్య, పాపన్న దొంగ అని ప్రచారం ప్రారంభించి, వెంకటాద్రి అన్న మాటే సాక్ష్యంగా ఉపయోగిస్తాడు. అంతకంటె కిష్టయ్యకు ఓడినట్టు ఒప్పుకుని, యాభైరూపాయలూ నష్టపడటమే నయం. అలా అనుకుని వెంకటాద్రి లోపలికి వెళ్ళి, యాభైరూపాయలూ తెచ్చి, కిష్టయ్య చేతిలో పెట్టి అతన్ని పంపేశాడు.

వెంకటాద్రి దగ్గిర ఉన్నదంతా కలిసి ఆ యాభైరూపాయలే. తన భార్య ఎంతో కాలంగా చెవులకు కమ్మలు కొనమని వేధిస్తూంటే, అతను ఒక్కొక్క రూపాయే చేర్చి ఆ సొమ్ము కూడబెట్టాడు. దాని కింకో పదిరూపాయలు చేరగానే కమ్మలు కొనవచ్చు.

ఇంకొక వారంలో వెంకటాద్రి మరదలి పెళ్ళి జరగబోతున్నది. కొత్తకమ్మలు పెట్టుకుని ఆ పెళ్ళికి వెళ్ళాలని వెంకటాద్రి భార్య తాపత్రయం. వెంకటాద్రి పందెంలో ఓడి, ఉన్న డబ్బంతా కిష్టయ్య కిచ్చుకున్న రోజునే వెంకటాద్రి భార్య అతని చేతికి పదిరూపాయలు ఇచ్చి, "ఇంక కమ్మలు కొనుక్కురండి," అన్నది.

తన దగ్గిర ఇప్పుడు డబ్బేమీ లేదంటూ, వెంకటాద్రి తన భార్యకు జరిగినదంతా చెప్పేశాడు. అతని భార్యకు కోపమూ, దుఃఖమూ ముంచుకొచ్చాయి. "మీ బుద్ధి బుగ్గయినట్టే ఉంది! మీరూ మీ దిక్కుమాలిన పందెమూనూ! ఇదే కాస్త తెలివితేట లున్నవాడైతే అపతలివా డన్నదే నిజమని ఒప్పుకుని యాభైరూపాయలు సంపాదించి ఉండును. ఇదంతా నా తలరాత!" అని గట్టిగా అన్నది.

వెంకటాద్రి అత్తగారు కూతురి దగ్గిరే ఉంటున్నది. ఆవిడ సంగతంతా తెలుసు

కుని, "హయ్యో! హయ్యో! ఇదేం గ్రహచారమమ్మా? ఇలాటి పందెం ఎక్కడైనా కద్దా? ఈ పీడాకారపు పాపన్న ఎక్కడ దాపరించాడే, తల్లీ?" అని ఎత్తుకున్నది.

"పాపన్న నేమీ అనకమ్మా! అయన ఏం చేశాడూ?" అన్నది కూతురు.

"ఇంకేం చెయ్యాలే? వాడి మూలంగానే కాదుటే సొమ్మంతా గంగపాలయిందీ? వాడి మొహం మండా! కొన్నట్టా, తిన్నట్టా? యాభైరూపాయ లంటే మాటలా?" అంటూ వెంకటాద్రి అత్తగారు పొలికేకలు ప్రారంభించింది. ఆవిడ పెట్టే కేకలన్నీ పొరుగింటి పిల్ల విన్నది. ఆ అమ్మాయి పనిపెట్టుకుని వెళ్ళి, పాపన్న భార్య మీనాక్షితో, పాపన్నను ఫలానా ఇంటివాళ్ళు ఘోరంగా ఆడిపోసుకుంటున్నారని చెప్పింది.

ఆ మాటలు విని మీనాక్షికి చాలా కష్టం వేసింది. ఆమె భర్త దగ్గిరికి వెళ్ళి, "ఏమండీ, మీ మూలంగా ఆ వెంకటాద్రికి యాభైరూపాయలు పోయాయుట. ఏం చేశారేమిటి?" అని అడిగింది.

"నా కేమీ తెలియదే. నే నీ మధ్య వెంకటాద్రిని కలవను కూడా లేదు," అన్నాడు పాపన్న ఆశ్చర్యంతో.

"వెంకటాద్రి అత్తగారు ఇంటి కప్పు ఎగరగొట్టుతున్నదట. వెళ్ళి, విషయు





మేమిటో కాస్త విచారించండి," అన్నది మీనాక్షి. పాపన్న వెంటనే బయలుదేరి వెంకటాద్రి ఇంటికి వెళ్ళాడు. వెంకటాద్రి పుట్టెడు దిగులుతో కూర్చుని ఉన్నాడు. అతని ద్వారా పాపన్న సంగతంతా రాబట్టి, "జరిగిందేదో జరిగింది. మీ ఆవిడ కొత్తకమ్మలతో పెళ్ళికి బయలుదేరేటట్టు చూద్దాం," అన్నాడు.

వెంకటాద్రి కంగారుపడి తనకు దానధర్మాలు స్వీకరించటం ఇష్టం లేదని స్పష్టం చేశాడు.

"అది నాకు తెలీదుటోయ్! అటువంటిదేమీ ఉండదులే. మళ్ళీ కనిపిస్తా," అంటూ పాపన్న వెళ్ళిపోయాడు.



పొరుగూళ్ళో కిష్టయ్య ఉండే ఇల్లు పాపన్నకు తెలుసును. అతను ఆ రాత్రి ఝాముపొద్దు పోనిచ్చి, నల్లని కంబళి కప్పుకుని, నెత్తికి ఒక ముసుగు తగిలించుకుని, చేత ఒక కత్తి పట్టుకుని తిన్నగా కిష్టయ్య ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు.

అప్పటికే నిద్రపోతున్న కిష్టయ్య, "ఎవరు వారు?" అంటూ లేచి వచ్చి తలుపు తెరిచాడు.

పాపన్న మారుగొంతు పెట్టి, "నోరెత్తావంటే గుండెల్లో పొడుస్తా!" అంటూ కత్తి పైకి ఎత్తాడు.

కిష్టయ్యకు ముచ్చెమటలు పోసి కాళ్ళు వణికాయి. పాపన్న లోపల ప్రవేశించి, తలుపు గడియ పెట్టి, "నీ డబ్బు పెట్టె తీసుకురా!" అన్నాడు.

కిష్టయ్య వణుకుతున్న చేతులతో ఒక కొయ్యపెట్టె తెచ్చి పాపన్న చేతికిచ్చాడు.

"ఇక నేను పోతున్నా. కిక్కురుమన్నావంటే నీ ప్రాణం తీస్తా," అని పాపన్న తలుపు తెరిచి ఉంచి బయటికి వెళ్ళిపోయాడు. కిష్టయ్య తన భార్యను లేపి, జరిగిన దొంగతనం గురించి చెప్పాడు.

"పాపిష్టి డబ్బు! ఉట్టుడియంగా స్నేహితుడితో పందెం వేసి యాభైరూపా



యలు కాజేశాడు. కట్టికుడపకుండా ఉంటుందా? పాపన్న అంటే అభిమానం గల దొంగ ఎవడో మీ సంగతి విని పగ తీర్చుకుని ఉంటాడు. ఆ పెట్టెలో రెండు వందల నగదూ, నగలూ అవీ ఉన్నాయి. అన్నీ పోయాయి. ఇక గడ్డి తిందాం!" అన్నది కిష్టయ్య భార్య కడుపుమంట కొద్దీ.

మర్నాడు ఉదయం పాపన్న, తాను కిష్టయ్య ఇంట దొంగిలించిన పెట్టెను ఒక సంచీలో పెట్టుకుని వెంకటాద్రి ఇంటికి వెళ్ళి, "కిష్టయ్య ఇంటికి పోదాం పద. అతను పందెం గెలుచుకున్నా ననుకుని నువు యాభైరూపాయలూ ఇచ్చేశావు. కాని గెలిచింది నువే నని నే నతని చేత ఒప్పిస్తాను," అన్నాడు.

పాపన్న అనే మాట వెంకటాద్రికి ఏమీ అర్థం కాలేదు, కాని అతను పాపన్న వెంట కిష్టయ్య ఇంటికి వెళ్ళాడు.

కిష్టయ్య ముఖంలో జీవం లేదు. అది చూసి, "ఏం కిష్టయ్యా, పెద్ద విచారంలో ఉన్నట్టున్నావు?" అని పాపన్న అడిగాడు.

"ఏం చెప్పమన్నారు, పాపన్నగారూ? నిన్న రాత్రి ఎవడో గజదొంగ తలుపు తట్టి మరీ లోపలికి వచ్చాడు. కత్తి చూపి మా ఇంటో ఉన్న డబ్బూ నగలూ సొంతం కాజేసుకుపోయాడు," అన్నాడు కిష్టయ్య.



"మన డబ్బయితే ఎక్కడికీ పోదు. దొంగను నేనే పట్టిస్తాను. కాని ప్రస్తుతం ఇంకో పనిమీద వచ్చాం. నిన్న మీరిద్దరూ నన్ను గురించి ఏదో పందెం వేసుకున్నారనీ, పందెంలో గెలిచి యాభై రూపాయలు సంపాదించావనీ విన్నాను. నిజమేనా?" అన్నాడు పాపన్న.

"నిజమే, నిజమే. బుద్ధి గడ్డితిని ఏదో వాగి, యాభై రూపాయలు సంపాదించుకున్నాను; దానికి అరింతలు పోగొట్టుకున్నాను కూడా!" అన్నాడు కిష్టయ్య.

"ఇదేనా దొంగ పట్టుకుపోయిన పెట్టె?" అంటూ పాపన్న సంచీలో నుంచి పెట్టె పైకి తీశాడు.

కిష్టయ్య నిర్ఘాంతపోయి, "అవునవును. అది మీ కెలా దొరికింది?" అన్నాడు.

"రాత్రి మీ ఇంట దొంగతనం చేసింది నేనేగా! ఇంతకూ నువు పందెంలో నెగ్గలేదు. వెంకటాద్రే నెగ్గాడు. అందుచేత నువు అతని దగ్గిర తీసుకున్న యాభైతో బాటు నువు ఓడిన యాభై జతచేర్చి, వంద రూపాయలూ ఇచ్చెయ్యి. డబ్బు ఈ పెట్టెలోనే ఉండి ఉంటుంది. నేను దాన్ని తెరిచికూడా చూడలేదు," అన్నాడు పాపన్న.

కిష్టయ్య తన వద్ద ఉన్న తాళపు చెవితో పెట్టె తెరిచి చూశాడు. పెట్టెలో ఉన్న వస్తువు లేమీ పోలేదు. కిష్టయ్య అందులో నుంచి నూరురూపాయలు తీసి వెంకటాద్రి ముందు పెట్టాడు.

"మనం స్నేహితులం. ఇది అర్థంలేని పందెం. అందుచేత నీ డబ్బు నా కవసరం లేదు. నా డబ్బు నాకిచ్చెయ్యి, చాలు," అన్నాడు వెంకటాద్రి. కిష్టయ్యకు తల తీసేసినట్టయింది. తను వెంకటాద్రి డబ్బు కోసం కక్కుర్తిపడి ఉన్నాడు. అతను ఆ పూట పాపన్ననూ, వెంకటాద్రినీ తన ఇంటనే భోజనానికి ఉండమని ఆహ్వానించి, ఆ సాయంకాలం చల్లబడ్డాక పంపేశాడు.





# ముఖంపంట

ఒక ఊళ్ళో సాంబు డనే బీదవాడి భార్య గర్భవతి అయింది. ఆ కారణంగా సాంబుడు గడ్డం పెంచాడు. వాడి భార్య పుట్టింటికి పోయి, పురుడు పోసుకుని, బిడ్డతో తిరిగి వచ్చే సరికి వాడి గడ్డం ఇంకా పెరుగుతూనే ఉన్నది.

"ఇదేమిటి? ఇంకా గడ్డం తీసెయ్యి లేదేం?" అని భార్య అడిగింది.

"ఏమీ లేదు. ఊరికినే," అన్నాడు సాంబుడు. వాడు గడ్డాన్ని అలా ఎందుకు పెంచుకుపోతున్నాడో తెలుసుకోవాలని సాంబుడి భార్య గట్టి పట్టుపట్టింది.

"ఏదో లాభం కోరే పెంచుతున్నాననుకోరాదా?" అన్నాడు సాంబుడు.

"గడ్డం పెంచితే లాభ మేమిటి?" అన్నది భార్య.

"పిచ్చిదానా, గడ్డం కూడా ఒక విధమైన పైరే కాదుటే? అది ముఖం పంట. పంట అమ్మితే డబ్బు రాదూ?" అన్నాడు సాంబుడు.

"ఈ దిక్కుమాలిన పంట ఎవరు కొంటారు? ఎంత కమ్ముదామని ఆశ పడుతున్నావు?" అని భార్య అడిగింది.

"మామూలు వాళ్ళు కొనలేకపోతే మన మహారాజుగారే కొంటారు, సరేనా? చీరె కొనమని ఎంత కాలంగానో చంపుకుతింటున్నావు. ఆ పంటతో నీ కొక చీరె వస్తే సరిపోలా?" అన్నాడు సాంబుడు.

మారువేషాలతో మహారాజూ, మంత్రీ నగరంలో సంచరిస్తూ వీధిలో ఉండి ఈ భార్యాభర్తల సంభాషణ అంతా విన్నారు. వాళ్ళు ఒకరి నొకరు చూసుకుని, చిరునవ్వు నవ్వుకుని అక్కణ్ణించి ముందుకు సాగిపోయారు.

మర్నాడు ఉదయం రాజుగారి భటు డొకడు వచ్చి సాంబుణ్ణి, ఉన్నపాళంగా

టి. ఆనందరావు



రాజుగారు పట్టుకు రమ్మన్నారని చెప్పాడు. ఈ మాట వినగానే సాంబుడికి దడ పుట్టింది. తన మురికి గుడ్డలూ, పెరిగిన గడ్డమూ చూసి తానే భయపడుతూ, చేసేది లేక వాడు రాజభటుడి వెంట వెళ్ళాడు.

కొంచెంసేపయాక సాంబుణ్ణి రాజుగారి వద్దకు తెచ్చారు. అక్కడ రాజూ, మంత్రి మాత్రమే ఉన్నారు. సాంబు డిద్దరికీ వంగి దణ్ణాలు పెట్టి, చేతులు కట్టుకుని, నేల చూస్తూ నిలబడ్డాడు.

"ఏంరా, నీ ముఖంపంటను మహారాజు గారు కొంటారుట, అమ్ముతావా?" అని మంత్రి సాంబుణ్ణి అడిగాడు.

తాను భార్యతో వేళాకోళానికి అన్న మాట మంత్రి నోట వినపడేసరికి సాంబుడికి ప్రాణా లెగిరిపోతున్న ట్టయింది.

"బుద్ధి గడ్డితిని, ఎవరూ వినటం లేదను కుని నా పెళ్ళాంతో ఏదో కూశాను. తప్పు కాయండి, మహాప్రభో!" అంటూ వాడు నేల మీద సాష్టాంగం పడ్డాడు. రాజుకు నవ్వాగిందికాదు.

"భయపడకురా. నిన్నెవరూ తప్పు పట్టటం లేదు. నీ ముఖంపంట నిజంగానే కొనదలిచాం. ఎంత కిస్తావో చెప్పు," అన్నాడు మంత్రి.

సాంబుడి కింకా మంత్రి మాటలలో నమ్మకం కుదరలేదు. వా డింకా పశ్చాత్తాప పడుతూ, "మంగలి కిచ్చే డబ్బు లాదా చేసి నా పెళ్ళాని కొక చీర కొని పెడదాం గదా అని గడ్డం గీయించలేదు. అంతేగాని, అది పంట అనీ, దాన్ని అమ్ముదా మనీ నా ఉద్దేశం కాదు, మహారాజా. నా అపరాధం మన్నించి నన్ను వది లెయ్యండి," అన్నాడు.

"ఎమైనా డబ్బు కోసమే గదా గడ్డం పెంచావు. ఎంత కావాలో చెప్పు. ఆ మొత్తం ఇచ్చి నీ గడ్డాన్ని మేం తీసుకుంటాం," అన్నాడు మంత్రి.

వాళ్ళు తనను శిక్షించరని నమ్మకం చిక్కినా కూడా సాంబుడికి ఇంత ఇవ్వ మనటానికి నోరు పెగలలేదు. చిట్టచివరకు వాడు అత్యంత సాహసంతో, "పదిరూపాయ లిప్పించండి," అన్నాడు.

మంత్రి వెంటనే వాడి చేతిలో పదిరూపా యలు పెట్టి, వాణ్ణి మంగలి దగ్గిరికి పంపి గడ్డం గీయించి, వాడికి బట్టలూ, వాడి భార్యకు చీరా, రవికా ఇప్పించి పంపేశాడు.

ఇంత జరిగాక సాంబుడి మనస్సు, బంధం నుంచి బయట పడిన పక్షి లాగా ఉల్లాసంగా ఎగిరింది. వాడు తాను తెచ్చిన బట్టలూ, డబ్బూ భార్యకు చూపించాడు.

"నీ పాడు గడ్డానికి రాజుగారు ఇవన్నీ ఇచ్చారా?" అన్నది భార్య నమ్మలేక.

"గడ్డం అనకే, ముఖంపంట అను. దాన్ని ఎవరూ కొనరంటివే. ఎంత కావాలో అడగమన్నారు రాజుగారు. నేను పది రూపాయలన్నాను గాని, వంద అడిగినా వెయ్యి అడిగినా కూడా ఇచ్చేవారే! వారికేం, మహారాజులు! అడగమన్నాక ఎంత అడి గినా ఇస్తారు!" అన్నాడు సాంబుడు.

"అలా అయితే మరి పదే ఎందుకు అడిగావు? నూరో, వెయ్యో అడిగితే నిక్షేపంగా బతికేవాళ్ళం గదా!" అన్నది సాంబుడి భార్య.






వ్యవహారం ఎదురు తిరిగింది. సాంబుడు తన భార్యను తిట్టాడు. ఆమె వాణ్ణి మళ్ళీ తిట్టింది. ఇద్దరూ చేసుకునే వాగ్యుద్ధ మంతా పొరుగునే ఉన్న శ్రీమంతుడి భార్య చెవిన పడింది. సాంబుడి భార్య ఇవతలికి వచ్చిన దాకా వేచి ఉండి, ఆవిడ సంగతి సందర్భా లన్నీ తెలుసుకుని తన భర్తతో చెప్పింది.

ఆ శ్రీమంతుడి పేరు వర్థకేశుడు. ఆయనకు ఎప్పుడూ మూరెడు గడ్డం ఉంటూనే ఉన్నది. అందుచేత ఆయనతో భార్య, "విన్నారా, మన పొరుగున ఉండే సాంబుడు తన పిచ్చిగడ్డాన్ని రాజుగారికి అమ్మి, పదిరూపాయలూ, తనకూ, తన పెళ్ళానికి కొత్తబట్టలూ తెచ్చుకున్నాట్ట. రాజుగారు వాడి గడ్డాన్ని ముఖంపంట అని, ఎంత కమ్మతా వన్నారుట. ఆ దరిద్రుడు పదిరూపాయ లడిగాడట. అది చాలా తక్కువ ధర అయి ఉంటుంది. అందుకే రాజుగారు వాడి గడ్డం—అదే, ముఖం పంట—తీసుకుని పదిరూపాయ లిస్తూ, కొసరుకింద బట్టలూ అవీ ఇచ్చారుట. వంద అడిగినా, వెయ్యి అడిగినా ఇచ్చేవారేనని సాంబుడే అంటున్నాడు. పిచ్చిసన్నాసి, వాడికి అడగటం చాతకాలేదు. వాడి పిచ్చి గడ్డానికే అంత ఇస్తే, ఏపుగా ఏళ్ళ తరబడి పెంచిన మీ గడ్డానికి రాజుగారు ఎంత అడిగినా ఇస్తా రనుకోవచ్చు. దానికి సువాసన నూనెలు రాచి, దువ్వి, ఎంతో పోషణ చేశారు గద," అన్నది.

వర్థకేశుడికి భార్య చెప్పిన సలహా నచ్చింది. ఆయన సాంబుడితో మాట్లాడి, తన భార్య చెప్పిన దంతా నిజమేనని తెలుసుకుని, తనగడ్డానికి మంచినూనె రాచి, చక్కగా దువ్వి, మంచి దుస్తులు ధరించి, రాజదర్శనానికి వెళ్ళాడు.

ఆ సమయంలో రాజు సభలో ఉన్నాడు. వర్థకేశుణ్ణి సభకు పిలిచారు. అతను వచ్చిన పని ఏమిటని మంత్రి అడిగాడు.

"మహారాజుగారు ముఖంపంట క్రయం చేస్తున్నా రని విని నా ముఖంపంట అమ్మకానికి తెచ్చాను," అంటూ వర్ధకేశుడు గడ్డం దువ్వుకున్నాడు.

రాజూ, మంత్రీ ముఖాలు చూసుకున్నారు.

"బేరం చెయ్యండి," అన్నాడు రాజు మంత్రితో.

"ఎంత ధర కిస్తావు?" అని మంత్రి వర్ధకేశుణ్ణి అడిగాడు.

"దీన్ని నేను ఎంతో శ్రద్ధగా పోషించుకుంటూ వచ్చాను. ఏపుగా పెంచాను. ఈ పంటకు పదివేలరూపాయలు దయచేయించండి," అన్నాడు వర్ధకేశుడు.

"ముఖంపంట వ్యాపారంలో బాగా అనుభవం గల వాడివిగా కనిపిస్తావు. నిన్న అనుభవం లేని వాడొకడు తన ముఖంపంటను కారుచౌకగా అమ్మి వెళ్ళిపోయాడు. అయితే మాకు తెలియకుండా, పన్ను చెల్లించకుండా ముఖంపంట వ్యాపారం చేస్తూ వస్తున్నందుకు నీకు పదివేలు జరిమానా విధిస్తున్నాం," అన్నాడు మంత్రి.

వర్ధకేశుడి దర్పమంతా క్షణంలో మాయమయింది. అతను కంగారుపడి, "ప్రభువులు, క్షమించాలి. నే నీ వ్యాపారం ఎన్నడూ చెయ్యలేదు. మా పొరుగున ఉండే సాంబుడు తన చింపిరిగడ్డాన్ని రాజుగారికి పదిరూయలకు అమ్మాడని విని, దురాశతో ఇలా వచ్చాను. నా అపరాధాన్ని క్షమించాలి," అంటూ దణ్ణాలు పెట్టాడు.

సభలో ఉన్నవారంతా గొల్లున నవ్వారు.

"రాజుగారు బీదసాదలకు ధనసహాయం చెయ్య దలిచినప్పుడు ఏదో మిష మీద చేస్తారు. అది చూసి నీబోటి ధనికులు దురాశపాలు కావటం కన్న బుద్ధితక్కువ మరి ఉండదు. ఈ సారికి నిన్ను క్షమించాం. ఇంకెన్నడూ డబ్బు కోసం ఇలా గడ్డి కరవకు," అని మంత్రి వర్ధకేశుణ్ణి మందలించి పంపేశాడు.





# మూడు సలహాలు

ఒక గ్రామంలో రాజన్న అనే పేదవాడుండేవాడు. ఒకనాడు వాడు తన భార్యతో, "ఏమే, ఉన్నది పెట్టుకుని నువు తింటూ ఉండు. నేను పట్నం వెళ్ళి, పని సంపాదించి, డబ్బు గడించి వస్తాను," అని చెప్పి పట్నం వెళ్ళాడు.

పట్నంలో ఒక పెద్దమనిషి దగ్గిర రాజన్నకు పని దొరికింది. రాజన్నకు పని బాగానే ఉండేది, వాడూ పనిని బాగానే చేసేవాడు.

యజమాని భార్య మంచి ఇల్లాలు. ఆవిడ రాజన్నకు తిండి లోపమూ, బట్ట లోపమూ రాకుండా చూసింది.

రాజన్న ఒక ఏడాదిపాటు పని చేశాడు. యజమాని తనకు జీతం రూపంలో కొంత డబ్బిస్తా డనుకున్నాడు రాజన్న. కాని అలాటి దేమీ జరగలేదు. పోనీ, పని మానుకుని ఇంటికి వెళ్ళేటప్పుడు రావలిసిన డబ్బంతా అడిగి లెక్కకట్టించి ఏకంగా తీసుకుపోదా మనుకుని వాడా విషయం మాట్లాడలేదు.

రెండేళ్ళు గడిచాయి, మూడేళ్ళు గడిచాయి, పదేళ్ళు గడిచాయి, ఇరవై ఏళ్ళు గడిచాయి. రాజన్నకు ఇంటి పైన ధ్యాస మళ్ళింది. వాడు యజమాని దగ్గిరికి వెళ్ళి, "అయ్యా, నేను మా వూరికి పోతాను. నాకు వచ్చే జీతం ఏదో ఇప్పించండి," అని అడిగాడు.

యజమాని ముఖం చిట్లించి, ఏవో లెక్కలు గుణించినట్టు నటించి, "నీ కేం వస్తుందిరా? మూడు వరహాలు వస్తుంది. అంతకంటె లక్షలకు విలువైన మూడు సలహా లిస్తాను, పట్టుకుపోయి బాగుపడు," అని చెప్పాడు.

రాజన్న కేమనటానికీ పాలుపోలేదు. పనిలో కుదురుకున్నప్పుడే జీతం సంగతి

ఎమ్. శేషశాయి

మాట్లాడుకుంటే తన కింత నష్టం కలక్క పోను. అందుచేత వాడు, "చిత్తం, అలాగే చెప్పండి," అన్నాడు.

"నా సలహా లేవంటే: నీకు సంబంధించని విషయాలను గురించి ఆరాలు తియ్యకు; మధ్య మార్గంలో పెడతోవలు పట్టకు; రాత్రి కలిగిన ఆగ్రహావేశాన్ని తెల్లవారిన దాకా ఆచుకో. ఇక వెళ్ళిరా," అన్నాడు యజమాని.

రాజన్న ఒక్క నిట్టూర్పు విడిచి, తన గ్రామానికి బయుయిదేరాడు. వాడు నగరం దాటి కొంత దూరం వెళ్ళేసరికి ఒక వింత దృశ్యం కనిపించింది. ఒక ఎండిపోయిన చెట్టు చుట్టూ నలభై ఒంటెలు నిలబెట్టి ఉన్నాయి. వాటి మీద బంగారుకాసుల మూట లున్నాయి. ఒక నల్లని అజాను బాహువు ఆ బంగారు కాసులను ఎండిన చెట్టుకొమ్మలకు ఆకుల్లాగా అమర్చుతున్నాడు. అది చూసి రాజన్న, "ఎందు కిలా అర్థంలేని పని చేస్తున్నావు?" అని అడుగుదా మనుకున్నాడు.

కాని అంతలోనే తన యజమాని ఇచ్చిన మొదటి సలహా జ్ఞాపకం వచ్చింది. "నీకు సంబంధించని విషయాలను గురించి ఆరాలు తియ్యకు."




ఈ మాట జ్ఞాపకం రాగానే రాజన్న నోరు మెదపక, తన దారిన తాను బయలు దేరాడు. వాడు రెండడుగులు వెయ్యగానే అజానుబాహువు, "ఏయ్, ఇలా రా, ఇలా రా!" అని పిలిచాడు.

"ఏం కావాలి?" అన్నాడు రాజన్న వెనక్కు వెళ్ళి.

"నేను రెండువందల ఏళ్ళుగా ఇదే ఆట ఆడుతున్నాను. ఇటుగా వెళ్ళిన ప్రతివాడూ, నే నెందు కిలా చేస్తున్నానని అడిగినవాడే! అందుచేత, ఆ మాట అడగకుండా వెళ్ళిన వాడికి ఈ బంగారుకాసులన్నీ ఇచ్చేద్దామనీ, అడిగినవాడి తల నరికేద్దామని శపథం



పట్టాను. ఇటుగా వచ్చిన ప్రతివాడి తలా నరికాను; అదుగో తలలగుట్ట చూడు. ఇంత కాలానికి నువ్వొక్కడివే నన్ను ఏమీ అడగకుండా నీ దారిన వెళ్ళావు. ఈ కాసులన్నీ పోగుచేసి ఒంటెల మీద ఎత్తుకుని, ఒంటెలను తోలుకుపో," అన్నాడు ఆ నల్లని ఆజానుబాహువు.

రాజన్న పంట పండింది. తాను ఇరవై ఏళ్ళూ పడిన శ్రమకు ఇరవైవేల రెట్లు ఫలితం దక్కింది. వాడు నలభై ఒంటెలనూ తోలుకుంటూ కొంత దూరం వెళ్ళేసరికి, వాడికి మరి ముగ్గురు కలిశారు. వాళ్ళు మరో నలభై ఒంటెల మీద బంగారు కాసుల మూటలు వేసుకుని తోలుకుంటూ వెళుతున్నారు.

"తమ్ముళ్ళూ, మీ ప్రయాణం ఎందాకా?" అని రాజన్న వాళ్ళ నడిగాడు.

"రేవుకు పోతున్నాం. అక్కడ ఈ డబ్బుతో సరుకులు కొని తిరిగి వస్తాం," అన్నారు వాళ్ళు.

కొంతదూరం రాజన్న వాళ్ళతో కలిసి ప్రయాణం చేశాడు. తరవాత వారి కొక అడ్డదారి తగిలింది.

"ఈ దారిన వెళితే కల్లు దుకాణం ఉన్నది. అక్కడ తాగి; దాహం తీర్చుకుందాం, రా," అన్నారు ఆ ముగ్గురూ రాజన్నతో. రాజన్న సరే నందా మనుకుంటూండగా, వాడికి యజమాని చెప్పిన రెండో సలహా గుర్తుకొచ్చింది. "మధ్యమార్గంలో పెడతోవలు పట్టకు."

యజమాని చెప్పిన మొదటి సలహా బాగా అచ్చిరావటంచేత రాజన్న రెండో సలహాను కూడా పాటించదలిచాడు. వాడు మిగిలిన వాళ్ళతో, "నేను రానులే. ఇక్కడే మీ కోసం ఆగి ఉంటాను. మీరు వెళ్ళిరండి," అన్నాడు.

"అయితే మేం తిరిగి వచ్చేదాకా మా ఒంటెలను కూడా కాస్త చూస్తూ ఉండు,"



అని వాళ్ళు అడ్డదారినపడి వెళ్ళిపోయారు. కాని వాళ్ళు కల్లు అంగడి చేరేలోపలనే, పొదలచాటు నుంచి బందిపోటు దొంగలు వచ్చి వాళ్ళ మీదపడి, వాళ్ళను చంపేసి, వాళ్ళ వద్ద ఉన్న కొద్ది బంగారపు కాసులనూ తీసుకుని పారిపోయారు.

వాళ్ళ కోసం ఆగి ఉన్న రాజన్న వద్దకు కల్లు దుకాణం మనిషి ఒకడు పరిగెత్తు కుంటూ వచ్చి, "నీ స్నేహితులు చచ్చారు," అని చెప్పాడు.

రాజన్న తన నలభై ఒంటెలతోబాటు, వాళ్ళ నలభై ఒంటెలను కూడా తోలు కుంటూ బయలుదేరి తన గ్రామం చేరాడు. అక్కడ వాడు తన ఎనభై ఒంటెలనూ ఒక పొలంలో ఉంచి, తన ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. రాజన్న భార్యే వచ్చి తలుపు తీసి, తన భర్తను గుర్తించక, "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అడిగింది.

"నేను పరదేశిని. ఈ రాత్రికి మీ ఇంట పడుకుని, ఉదయానే నా దారిన నేను పోతాను," అన్నాడు రాజన్న, భార్యను వేడిపించి, తరవాత నిజం చెబుదామని.

"మా ఆయన ఊళ్ళో లేడు. నేను ఒంటరిగా ఇంట్లో ఉంటున్నాను. అందు చేత ఇంట్లో పడుకునేటందుకు వీల్లేదు.



కావలిస్తే ఈ గొడ్లపాకలో చోటు చూసుకుని పడుకోవచ్చు. భోజనం కావాలా?" అన్నది రాజన్న భార్య.

కావాలన్నాడు రాజన్న. అతనికి అతని భార్య పేద తిండి పెట్టింది. తన భార్య శీలం చూసి రాజన్న చాలా సంతోషించి, తెల్లవారాక ఆమెకు నిజం చెప్పి ఆశ్చర్య పెడదామనుకున్నాడు.

అతను గొడ్లపాకలో గడ్డి పరుచుకుని పడుకున్నాడు, కాని నిద్రరాలేదు. అతని కళ్ళు ఇంటి మీదనే ఉన్నాయి.

కొంచెం పొద్దు పోయాక మసక చీకట్లో ఎవడో మనిషి రావటమూ, స్వతంత్రంగా

తలుపు తెరుచుకుని, లోపలికి వెళ్ళి తలుపు గడియ పెట్టటమూ రాజన్న కంట పడింది. తన భార్య మీద కలిగిన సదభిప్రాయం అంతా పోయి, పెళ్ళాన్ని చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది రాజన్నకు.

"ఈ ముండ ఇంకెవణ్ణో పెళ్ళి చేసుకున్నది. అందుకే నన్ను ఇంట్లో పడుకోనివ్వ లేదు. ఆ ఇద్దరి ప్రాణాలూ ఇప్పుడే తీస్తాను," అనుకుంటూ రాజన్న చివాలున లేచాడు.

కాని అంతలోనే తన యజమాని చెప్పిన మూడో సలహా జ్ఞాపకం వచ్చింది. "రాత్రి కలిగిన ఆగ్రహావేశాన్ని తెల్లవారిన దాకా ఆపుకో."

ఇప్పుడు చేసే పని తెల్లవారినాకనే చెయ్యవచ్చు ననుకుని రాజన్న మళ్ళీ నడుంవాల్చాడు.

తెల్లవారింది. రాజన్న ఇంటి వాకిలి తెరుచుకున్నది. ఒక యువకుడూ, వాడి వెనకగా రాజన్న భార్యా వచ్చారు. యువకుడు వెనక్కు తిరిగి "వంట భయం వద్దులే, అమ్మా. పొలం నుంచి చిక్కుళ్ళు తెస్తాను. మనం తిని, ఆ పరదేశి కూడా కడుపునిండా తిండి పెడదాం," అన్నాడు. ఆ కుర్రవాడు రాజన్న వెళ్ళేనాటికి తల్లి గర్భంలో ఉన్నాడు.

వాడు తన కొడుకేనని తెలియగానే రాజన్నకు ఆనందంతో ఎక్కు వచ్చింది. వాడు గొడ్లపాకలో నుంచి పరిగెత్తుకుంటూ వచ్చి తన కొడుకును కౌగలించుకుని, "చిక్కుళ్ళేమిట్రా పిచ్చివాడా? మనకు ఎనభై ఒంటెల బంగారం ఉన్నది. మంచి మంచి కూరలూ, నారలూ కొనుక్కురా. ఇక మనం అర్ధాకలిగా తిన నవసరం లేదు," అన్నాడు.

ఆ పరదేశీ తమవాడే ననీ, ఇరవైఏళ్ళకు అతను లక్షాధికారి అయి తిరిగి వచ్చాడనీ తెలిసి రాజన్న భార్యా, కొడుకూ పట్టరాని ఆనందం పొందారు.






మర్నాడు తెల్లవారుతూనే లవణుడు ఆహారం సంపాదించటానికై మధుపురం దాటి బయటికి వెళ్ళాడు. ఆ సమయంలో శత్రుఘ్నుడు యమునా నదిని దాటి, మధుపుర ద్వారం వద్ద నిలబడ్డాడు.

మధ్యాన్నం రెండు జాములయే సరికి లవణుడు తాను చంపిన జంతువు లన్నిటినీ మోస్తూ తన నగరానికి తిరిగి వచ్చి, ద్వారం వద్ద ఉన్న శత్రుఘ్నుణ్ణి చూసి, విరగబడి నవ్వుతూ, "ఒరే మనిషీ, నాకు ఆహారం కావటానికా వచ్చావు? ఇవాళ నాకు మంచి విందే!" అన్నాడు.

రోషంతో శత్రుఘ్నుడి కళ్ళు ఎర్రబడ్డాయి. "నీతో యుద్ధం చేసి, నిన్ను చంపటానికి వచ్చానురా, లవణుడా! నేను దశరథమహారాజు కొడుకును, రాముడి తమ్ముణ్ణి, నా పేరు శత్రుఘ్నుడు. ఇవాళ నా చేత నీకు చావు తప్పదు," అన్నాడతను.

లవణుడు వెటకారంగా నవ్వి, "నాకు మామ వరస అయిన రావణుణ్ణి మీ అన్న చంపినా మిమ్మల్ని నేను లక్ష్యపెట్టలేదు. నేను మహామహా వాళ్ళనే చంపాను. నాకు మీ వంటి వాళ్ళు గడ్డితో సమానం. నన్నెవరూ జయించలేరు. నాతో యుద్ధం చెయ్యవచ్చావుగా? ఉండు నీ తీట తీరుస్తాను. నన్ను వెళ్ళి ఆయుధం పట్టుకు రానీ," అన్నాడు.

"నా కంటపడిన నిన్ను ప్రాణాలతో పోనిస్తా ననుకున్నావా? నిన్ను ఈ క్షణం లోనే చంపేస్తాను," అన్నాడు శత్రుఘ్నుడు.



లవణుడు పళ్ళుకొరికి, చేతులు పిసుక్కుని, చెట్లు పెరికి శత్రుఘ్నుడి పైన విసరసాగాడు. శత్రుఘ్నుడా చెట్లనన్నిటినీ తన బాణాలతో నరికాడు. కాని ఒక చెట్టు తల మీద తగిల్తి శత్రుఘ్నుడు మూర్ఛపోయాడు. అది చూసి, శత్రుఘ్నుడు చచ్చాడనుకుని, మందమతి అయిన లవణుడు తన శూలాన్ని తెచ్చుకోవటానికి వెళ్ళలేదు. అందుకు మారుగా వాడు తాను చంపిన మృగాల మోపు నెత్తుకుని బయలుదేరే టంతలో శత్రుఘ్నుడు మూర్ఛ తెలిసి, ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు. మరుక్షణమే అతను, రాముడు తన కిచ్చిన బాణాన్ని ధనువుకు సంధించి, లవణుడి పైకి వదిలాడు. అది నిప్పులు కక్కుతూ వెళ్ళి, లవణుడి గుండెను చీల్చింది. లవణుడు చచ్చాడు. వెంటనే వాడి ఇంట ఉండే త్రిశూలం శివుడి వద్దకు వెళ్ళిపోయింది.

తరవాత శత్రుఘ్నుడు తన సేనను పిలిపించి, మధుపురాన్ని ఆక్రమించి, దానికి రాజై పాలించ సాగాడు. పన్నెండేళ్ళు గడిచాక అతనికి రాముణ్ణి చూడా లనిపించింది. అతను కొద్ది సేననూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని అయోధ్యకు బయలుదేరి, దారిలో వాల్మీకి ఆశ్రమంలో ఒకరాత్రి మజిలీ చేశాడు.

వాల్మీకి శత్రుఘ్నుడికి అర్ఘ్యపాద్యాలిచ్చి ఆతిథ్యం జరిపి, అతనికీ, అతని సేనకూ, పరివారానికీ భోజనాలు పెట్టించాడు. భోజనాలయాక వారంతా వాల్మీకి రచితమైన రామకథను రాగతాళాలతో సహా విని ఎంతో అద్భుతం చెందారు. జరిగిపోయిన ఆ కథ మళ్ళీ కళ్ళ ఎదట జరుగుతున్నట్టే వాల్మీకి దానిని రచించాడు.

ఆ రాత్రంతా రామకథను వినటంలోనే గడిచిపోయింది. మర్నాడు శత్రుఘ్నుడు వాల్మీకి వద్ద సెలవు పుచ్చుకుని, అయో

ధ్యకు వెళ్ళి, రాముణ్ణి చూసి, "అన్నా, నీ ఆజ్ఞానుసారం లవణుణ్ణి చంపి అతని రాజ్యాన్ని ఏలుతున్నాను. కాని పన్నెండేళ్ళ పాటు నిన్ను చూడక తహతహ పుట్టి బయలుదేరి వచ్చాను," అన్నాడు.

రాముడు శత్రుఘ్నుణ్ణి కౌగలించుకుని, "నాయనా, రాజుకు రాజ్యం చెయ్యక తప్పదు గద. నీ రాజ్యం నీవు చూసుకో. ఎప్పుడన్నా నన్ను చూడాలనిపిస్తే వస్తూ ఉండు," అని అతన్ని పంపేశాడు.

భరతలక్ష్మణులు సపరివారంగా బయలుదేరి, శత్రుఘ్నుణ్ణి చాలా దూరం సాగనంపి, వెనక్కు తిరిగి వచ్చారు.

తరవాత కొన్ని రోజులకు ఒక పల్లెటూరి బ్రాహ్మణుడు తన అయిదేళ్ళ కొడుకు శవం తెచ్చి రాజద్వారం దగ్గిర నిలబడి ఏడవటం మొదలుపెట్టాడు. తన కున్న ఒకే కొడుకు అకాలమరణం పొందినందుకు ఏడుస్తూ ఆ బ్రాహ్మణుడు, రాజు సరిగా పాలిస్తే ఇలాటి అకాలమరణాలుండవనీ, ఇన్నాళ్ళకు ఇక్ష్వాకుల పరిపాలనలో, రాముడి హయాంలో దేశం దిక్కుమాలినదయిందనీ అన్నాడు.

రాముడీ సంగతి తెలుసుకుని చాలా చింతించి, తన మంత్రులనూ, వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులనూ పిలిపించి,





వారితో బ్రాహ్మణబాలుడి అకాలమరణం గురించి చెప్పాడు. ఒక శూద్రుడు గొప్ప తపస్సు చేస్తున్నాడనీ, అది యుగధర్మానికి విరుద్ధమనీ, అందుకే ఈ బాలుడు చని పోయాడనీ నారదుడు రాముడితో అన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "నీవు వెళ్ళి ఆ బ్రాహ్మణుణ్ణి ఓదార్చి, ఆ బాలుడి కళే బరాన్ని తైలభాండంలో భద్రంగా ఉంచు," అన్నాడు. తరవాత అతను ఆయుధాలు తీసుకుని పుష్పకం ఎక్కి, పడమరా, ఉత్త రమూ, తూర్పూ గాలించి, చివరకు దక్షిణ దిక్కున, ఒక సరస్సులో తలకిందుగా తపస్సు చేస్తున్న మనిషి నొకణ్ణి చూశాడు.



అతను విమానం దిగి ఆ వ్యక్తిని సమీ పించి, "నేను రాముణ్ణి, దశరథమహారాజు కొడుకును. తెలుసుకోవాలన్న కుతూహలం కొద్దీ అడుగుతున్నాను. నీ వే జాతివాడివి? ఏం కోరి ఈ కఠోర తపస్సు చేస్తున్నావు?" అని అడిగాడు.

తలకిందులుగా ఉండే ఆ తాపసి, "రాజా, నేను శూద్రుణ్ణి. నా పేరు శంబూ కుడు. బొందితో స్వర్గానికి పోగోరి నేనీ తపస్సు చేస్తున్నాను," అన్నాడు. అత నింకా మాట్లాడుతూండగానే రాముడు తన కత్తి దూసి శంబూకుడి తల నరికేశాడు.

వెంటనే దేవతలు రాముడిపైన పుష్ప వర్షం కురిపించి, దుందుభులు మోగించి, "రామా, ఈ శూద్రుడు స్వర్గానికి రాకుండా చేశావు. మాకంతే చాలు. ఏం వరం కోరు తావో కోరు," అన్నారు.

"అకాలమరణంపాలయిన ఆ బ్రాహ్మణ బాలుణ్ణి బతికించండి," అన్నాడు రాముడు.

"శంబూకుడి తలతెగిన క్షణంలోనే ఆ బాలుడు బతికాడు," అంటూ దేవతలు వెళ్ళిపోయారు.

రాము డక్కడినుంచి, ఆ సమీపంలోనే ఉన్న అగస్త్యాశ్రమానికి వెళ్ళి, ఆ ముని ఇచ్చిన అతిథిసత్కారాలు స్వీకరించాడు.

అగస్త్యుడు రాముడి కొక ఆభరణాన్ని బహూకరించాడు. రాముడు దాన్ని స్వీకరించి, "స్వామీ, ఇది దివ్యాభరణంలాగున్నది. ఇది తమకు ఎవరిచ్చారు?" అని అడిగాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా అగస్త్యుడు శ్వేతుడి కథ చెప్పాడు.

వెయ్యియోజనాల విస్తృతి గల ఒక అరణ్యం ఉండేది. దాని మధ్య యోజనం చదరం గల సరస్సుండేది. ఆ అరణ్యంలో ఒక్క పక్షిగాని, మృగంగాని ఉండేది కాదు. సరస్సుకు సమీపంలో ఒక ఆశ్రమం ఉండేది. అగస్త్యుడా ఆశ్రమానికి వెళ్ళి, ఒక రాత్రి అందులో గడిపి, 'తెల్లవారు జామున సరస్సు వద్దకు వెళ్ళాడు. దాని ఒడ్డున ఆయన కొక పుష్టి గల శవం కనబడింది. అది ఏ మాత్రమూ చెక్కుచెదరకుండా ఉన్నది. అది ఏ విధమైన శవం అయి ఉంటుందా అని అగస్త్యుడు ఆలోచిస్తూండగా, అక్కడ ఒక విమానం ఆకాశం నుంచి దిగింది. అదొక దివ్య విమానం. అందులో ఒక దివ్యపురుషుడూ, అతన్ని సేవిస్తూ అనేకమంది అప్సరసలూ ఉన్నారు. అప్సరసలలో కొందరు పాడుతున్నారు, కొందరు వాద్యాలు వాయిస్తున్నారు, మరికొందరు నృత్యాలు చేస్తున్నారు.



కొంతసేపయాక ఆ దివ్యపురుషుడు విమానం నుంచి దిగి, సరస్సుతీరాన ఉన్న శవాన్ని తిని, సరస్సులో చెయ్యీ, నోరూ కడుక్కుని, తిరిగి విమానం ఎక్కబోయాడు. అదంతా చూస్తూ ఉండిన అగస్త్యుడు, "అయ్యా, నీ వెవరు? ఇలాటి పనికిమాలిన భోజనం చెయ్యటానికి కారణమేమిటి? ఎంత హీనులు కూడా ఇలాటి పని చెయ్యరు గదా!" అన్నాడు.

ఆ దివ్యపురుషుడు అగస్త్యుడికి తన పూర్వ కథ చెప్పాడు.

అతను విదర్భరాజైన సుదేవుడి కొడుకు. అతని పేరు శ్వేతుడు. సుదేవుడి కిద్దరు



భార్యలు, ఇద్దరికీ ఇద్దరు కొడుకులు కలిగారు. వారిలో పెద్దవాడీ శ్వేతుడు. చిన్నవాడి పేరు సురథుడు. శ్వేతుడు తన తండ్రి అనంతరం చాలాకాలం రాజ్యం ఏలి, చివరకు సురథుడికి పట్టంకట్టి, తాను తపస్సు చేసుకున్నాడు. దీర్ఘతపస్సు చేసి అతను దేహం చాలించి, బ్రహ్మలోకానికి వెళ్ళాడు. కాని బ్రహ్మలోకంలో కూడా అతన్ని ఆకలిదప్పులు విడవలేదు. అది చూసి కంగారుపడి అతను బ్రహ్మ వద్దకు వెళ్ళి, బ్రహ్మలోకంలో కూడా తనను ఆకలిదప్పులు వేధించటానికి తాను ఏం తప్పుచేసి ఉండాలని అడిగాడు.



దానికి బ్రహ్మ, "జంతువులు లేని అడవిలో నీకు భోజన సంతుష్టి ఏ మాత్రమూ లభించలేదు. అదీకాక నీవు అస్తమానమూ తపస్సులో ఉండి అతిథులకు భోజనం పెట్టలేదు. అందుకే నిన్ను ఆకలిదప్పులు వదలకుండా ఉన్నాయి. అరణ్యంలో ఉన్న నీ శవాన్నే తిని నీ ఆకలి దప్పులను తీర్చుకుంటూ ఉండు. కొంతకాలానికి అక్కడికి అగస్త్యుడు వచ్చి, తన అపారమైన మహిమ చేత నీ ఆకలిదప్పులను పూర్తిగా పోగొట్టుతాడు," అని చెప్పాడు.

తనను పలకరించినవాడు అగస్త్యుడేనని తెలియగానే ఆ దివ్యపురుషుడు, "స్వామీ, నన్ననుగ్రహించి, నాకీ కష్టం తొలగించండి. దానికి ప్రత్యుపకారంగా ఈ ఆభరణం స్వీకరించండి. ఇది ప్రతిరోజూ బంగారాన్నీ, ధనాన్నీ, బట్టలనూ, ఆహారాన్నీ, నగలనూ ఇస్తూ ఉంటుంది," అన్నాడు.

అగస్త్యుడా ఆభరణాన్ని స్వీకరించగానే శవం కాస్తా శిథిలమైపోయింది.. దివ్యపురుషుడు సంతోషించి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

రాముడీ కథ విని అగస్త్యుడితో, "స్వామీ, శ్వేతుడు తపస్సుచేసిన వనంలో మృగాలూ, పక్షులూ లేకపోవటాని కేమిటి కారణం?" అని అడిగాడు.



ఆ కథను అగస్త్యుడీ విధంగా చెప్పాడు: కృతయుగంలో మనుచక్రవర్తి తన కొడుకైన ఇక్ష్వాకుడికి పట్టం గట్టి, రాజనీతి చక్కగా బోధించి, తాను బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. ఇక్ష్వాకు నూరుగురు కొడుకులను కన్నాడు. వారిలో ఆఖరివాడు దండుడు. అతను బుద్ధిహీనుడు. ఆ దండుడికి ఇక్ష్వాకు వింధ్య శైవలప్రాంతాల మధ్య రాజ్యం ఇచ్చాడు. దండుడు అక్కడ మధుమంత మనే చక్కని నగరం నిర్మించుకుని, శుక్రాచార్యులను గురువుగా పెట్టుకుని, రాజ్యంచేస్తూ వచ్చాడు.

శుక్రాచార్యులకు అరజ అనే అందమైన కూతురుండేది. ఒకనాడు దండుడు వనంలో తిరుగుతూ, ఒంటరిగా ఉన్న అరజను చూసి, ఆమెను కోరాడు. అరజ, తాను శుక్రాచార్యులు కూతురిననీ, దండుడు వెర్రి మొర్రి వేషాలువేస్తే శుక్రాచార్యులు ఘోరమైన శాపం ఇస్తాడనీ హితవు చెప్పింది. అయినా, మందమతి అయిన దండుడు అరజ హితబోధ వినక, ఆమెను బలాత్కరించాడు.

అతను మధుమంతానికి తిరిగివెళ్ళాక, అతని దుష్ప్రవర్తన శుక్రుడికి తెలిసింది. మధుమంతం చుట్టూ నూరు యోజనాల మేర ఏడు రోజులపాటు ధూళివర్షం కురిసి, సమస్తమూ నశించి పోవాలని శుక్రాచార్యుడు శపించాడు.

ఈ శాపం సంగతి వింటూనే అక్కడ నివసించే వారందరూ ఆ ప్రాంతాన్ని విడిచి వెళ్ళిపోయారు.

శుక్రుడు చెప్పినట్టే ఆ ప్రాంతమంతా వారం రోజులపాటు ధూళివర్షం కురిసి నాశనమైపోయింది.

ఈ కథలు వింటూ రాముడు అగస్త్యాశ్రమంలో కొంతసేపుండి, ఆ మహాముని వద్ద సెలవు పుచ్చుకుని అయోధ్యకు తిరిగి వచ్చేశాడు.






# అరణ్యపురాణం

సీయోనీ కొండలలో ఒక గుహ. అందులో ఒక తోడేలయ్య సకుటుంబంగా కాపరం ఉంటున్నాడు. అతడికి భార్యా, నలుగురు పసికందులూనూ.

సాయంకాలం ఏడయింది. చంద్రుడు గుహలోకి తొంగి చూస్తున్నాడు. తోడేలయ్య కాళ్ళు చాచి, ఒళ్ళు విరుచుకుని, నిద్ర లేచాడు. వేటకు వేళ అయింది. తోడేలయ్య కొండ దిగిపోదామనుకుంటుండగా గుహ ద్వారాన నీడ కనపడింది. "శుభం కలగ వలె, తోడేలుదొరా! పిల్లలకు గట్టి దంతాలు రావలె! ధర్మం వర్థిల్లవలె!" అన్నది నక్క అతి వినయంగా.

నక్క తబకీ అంటే తోడేళ్ళకు తగని రోత. అది అన్నిచోట్లా చెడతిరిగి, చాడీకోరు కబుర్లు చెబుతుంది. ఎంగిలి నాకుతుంది. ఏ చెత్తపోగు మీది తోలుముక్కలైనా కొరుకుతుంది. గుడ్డపీలికలను కూడా విడిచిపెట్టదు.

అయితే నక్క అంటే తోడేళ్ళకు కొంత భయం కూడా లేకపోలేదు. ఎందుకంటే, ఉన్నట్టుండి దానికి పిచ్చెత్తుతుంది. పిచ్చి నక్క అంటే పులికికూడా హడలే. పిచ్చినక్క కాటు వల్ల సంభవించే మరణం మహా దారుణమైనది.

"లోపలికి వచ్చి చూసుకో కావలిస్తే. తిండి ఏమీలేదు," అన్నది తోడేలు నక్కతో.

"తమకు లేకపోవచ్చు. నాబోటివాడి కెంత కావాలి? ఎండు ఎముకైనా చాలు," అంటూ నక్క గుహమూల పడి ఉన్న ఒక ఎముక మీది మాంసం గీరుకు తింటూ, "ఆహా, ఎంత చక్కని భోజనం! ఎంత, చక్కని పిల్లలు! చెంపకు చారడేసి కళ్ళు!...అన్నట్టు షేర్‌ఖాన్‌గారు—అంటే పెద్దాయన—మన ప్రాంతాలకి వేటాడ వచ్చారు. ఈ నెలల్లా ఇక్కడే వేటాడుతూ ఉండిపోతామని నాతో అన్నారు!" అన్నది.

అట్ట చివరి బొమ్మ




షేర్‌ఖాన్ అనేది ఒక పులి, అది ఇరవై మైళ్ళ దూరాన వాయిన్‌గంగా నదీతీరాన నివాసం ఉంటుంది.

"అది చట్టవిరుద్ధం! షేర్‌ఖాన్ ముందు చెప్పకుండా చెందకుండా తన వేటస్థలాన్ని మార్చటం అరణ్యచట్టానికి విరుద్ధం. పది మైళ్ళమేరలోగల మృగాలన్నీ బెదిరిపోతాయి. నా సంగతి చూడబోతే, మా ఆవిడ వేట కూడా ప్రస్తుతం నేనే ఆడాలాయె!" అన్నది తోడేలు.

"వాణ్ణి వాళ్ళమ్మ మొదటి నుంచీ సొట్ట డనే పిలిచేది. పుట్టినప్పుడే కుంటికుంక. అందుకే పశువుల్ని తప్ప వేటాడిచావలేడు. వాయిన్‌గంగ ప్రాంతంలో వాళ్ళని రెచ్చగొట్టాడు. ఇప్పుడిక్కడా అదే చెయ్యటానికి దాపరించాడు. వాడి కోసం దుబ్బు అంటిస్తారే, అప్పుడుంటాయి మనపాట్లు," అన్నది తోడేలమ్మ తాపీగా.

ఇంతలో కొండ కింది లోయలో నుంచి షేర్‌ఖాన్ కంఠం వినిపించింది. నక్క చల్లగా జారుకున్నది.

"చచ్చువెధవ! ఊరపొద్దూక్కముందే ఆ రంకె లేమిటి? ఇక్కడి వేటమృగాలు లేళ్ళు, వాయిన్‌గంగ దున్నలనుకుంటున్నాడో ఏమో!" అన్నాడు తోడేలయ్య.

"వాడు వేటాడుతున్నది లేడీ కాదు, దున్నా కాదు—మనిషి," అన్నది తోడేలమ్మ.

"ఛీ, ఛీ! మనిషిని వేటాడే బదులు కప్పల్ని, చేపల్ని తిని కడుపు నింపుకోరాదూ?" అన్నాడు తోడేలయ్య నిరసనగా.

ఎంతమాత్రమూ దాటరాని అరణ్యపు కట్టుబాట్లలో ఒకటి ఏమిటంటే వీరమృగాలు మనిషిని వేటాడరాదన్నది. దీనికి బలమైన కారణం లేకపోలేదు. అవి మనిషిని వేటాడనారంభించినట్టయితే మనుషులు ఏనుగులెక్కి తుపాకులు తీసుకుని, కాగడాలూ, అవ్వాయచువ్వాలూ, తప్పెట్లూ వేసుకుని వచ్చి పడతారు. అది అరణ్యాని కంతకీ



ఉపద్రవం. అయితే మృగాలు తమలో తాము చెప్పుకునే కారణం వేరే ఉన్నది. అన్ని జంతువులలోకీ మనిషి దుర్బలుడూ, అసహాయుడూనూ. అతడి జోలికి పోవటం శూరలక్షణం కాదు; పైపెచ్చు మనిషిని తినే జంతువులకు ఒళ్ళు వాస్తుంది, దంతా లూడిపోతాయి.

పులి అరుపు బొబ్బగా పరిణమించింది. అది దూకింది, కాని మరుక్షణమే రోదన ధ్వని చేసింది పులి.

"అందలేదు. ఏమిటో అది?" అన్నది తోడేలమ్మ.

తోడేలయ్య బయటికి తొంగి చూశాడు. షేర్‌ఖాన్ పొదల మధ్యగా పడుతూ లేస్తూ, ఏదో గొణుగుతున్నాడు.

"వెధవ, కలప కోసేవాళ్ళ నెగడు లోకి దూకి కాళ్ళు కాల్చుకున్నాడు. తబకీ వెంటే ఉన్నాడు," అన్నాడు తోడేలయ్య.

తోడేలమ్మ చెవి రిక్కించి కొద్దిసేపు విని, "ఎవరో కొండ ఎక్కి వస్తున్నారు జాగ్రత్త!" అన్నది మెల్లిగా.

పొదల్లో అలికిడి అయింది. తోడేలయ్య లఘించటానికి సిద్ధంగా కూర్చున్నాడు. సరిగా తరుణం చూసి లంఘించబోయి అంతలో ఏదో చూసి తనను తాను నిగ్రహించుకోవ



టంలో, గాలిలోకి నాలుగైదు అడుగుల ఎత్తు లేచి, మళ్ళీ అక్కడే పడ్డాడు.

"మనిషి! మనిషిపిల్ల! చూడు," అన్నాడు తోడేలయ్య.

అతని కెదురుగా ఒక పిల్లవాడు, కొద్ది ఎత్తులో ఉన్న మండ ఒకటి పట్టుకుని నిలబడి ఉన్నాడు. వాడి కిప్పుడిప్పుడే నడక వస్తున్నది. వాడు తోడేలయ్య ముఖంలోకి చూసి నవ్వాడు. వాడి ఒళ్ళు మెత్తగా, సొట్ట లతో నవనవలాడుతున్నది.

"అదా మనిషి పిల్లంటే? ఎన్నడూ చూడలేదుస్మీ. ఏదీ, ఇలా పట్రా," అన్నది తోడేలమ్మ.



తోడేలయ్యా ఆ పిల్లవాడి వీపును తన దవడలమధ్య బలంగాపట్టి తీసుకొచ్చి తన పిల్లలమధ్య పెట్టాడు. పిల్లవాడి శరీరానికి ఇంత చిన్న గాటు కూడా లేదు.

"ఎంత చిన్న ఒళ్ళు! ఎంత నున్నని వాడు! ఎంత ధైర్యం!" అన్నది తోడేలమ్మ మృదువుగా. పిల్లవాడు తోడేలు పిల్లల మధ్య వెచ్చగా చోటుచేసుకుని, వాటి ఆహారమే తానుకూడా తినసాగాడు. అదిచూసి తోడే లమ్మ తెగముచ్చటపడింది.

"ఎప్పుడైనా తోడేళ్ళు తమ పిల్లలతో బాటు మనిషి పిల్లని పెంచటం కద్దా?" అన్నదావిడ.

"ఎప్పుడో జరిగినట్టు వినటమే గాని, మన మందలో, మనకాలంలో ఎరగం. వాణ్ణిచూడు, ఒంటిన ఒక్క వెంట్రుకలేదు, నేను కాలుతో ఇలా అన్నానంటే చస్తాడు, కాని వాడికి భయంలేదు,'" అన్నాడు తోడేలయ్యా.

గుహద్వారాన వెన్నెల కాస్తా పోయింది. ఆ ద్వారంలో షేర్‌ఖాన్ తలా, భుజాలూ ప్రత్యక్షమయాయి. "దొరా, దొరా! అది ఈ లోపలికే వెళ్ళింది," అని తబకీ కీచు గొంతు వినిపించింది.

"మనిషికూన! నా వేటను నా కిచ్చెయ్యండి. దాని తల్లీ తండ్రీ తప్పించుకుపోయారు," అన్నాడు షేర్‌ఖాన్. అతను నెగడులోకి దూకి కాళ్ళు కాల్చుకున్నమాట నిజమే. ఆ బాధమూలాన చాలా కోపంలో ఉన్నాడు. అయితే అతను ఆ ద్వారంలో నుంచి దూరి గుహలోకి రాలేడని తోడేలయ్యా ఎరుగును. ఇప్పటికే ద్వారంలో అతని తలా భుజాలూ నొక్కుకుంటూ ఉండి ఉండాలి.

"తోడేళ్ళు స్వతంత్రులు. వారిని ఆజ్ఞాపించగలవాడు మందనాయకుడు మాత్రమే. ప్రతి చారలమెకమూ చెప్పినట్టు వాళ్ళు నడుచుకోరు. మనిషికూన మాది!" అన్నాడు తోడేలయ్యా.

—(ఇంకా వుంది)



# 55. నెపోలియన్ సమాధి

నెపోలియన్ చక్రవర్తి వాటర్లూ యుద్ధంలో ఓడిపోయాక సేంట్ హెలెనా ఖైదులో నిర్బంధించబడి అక్కడే మరణించాడు. 1840 లో ఆయన భౌతికకాయాన్ని పారిస్ లోని ఈ సమాధిలో ఖననం చేశారు.



Photo by P. Krishna Kumar



బహుమతి
పొందిన వ్యాఖ్య

గడచిన గండం

పంపినవారు:
వి. ఎస్. కుమార్, చినపళ్లపూడి

Photo by C. M. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

గడితేరని పిండం

పంపినవారు:
పి. ఎస్. కుమార్, చినవడ్లపూడి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1966 ఆగష్టు నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గడచిన గండం

రెండవ ఫోటో : గడితేరని పిండం

పంపినవారు : వి. సునీల్‌కుమార్,

చినవడ్లపూడి, (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


SPECTRUM
COLOUR



మానవసేవే మాధవసేవ!




జవహర్ లాల్ నెహ్రూ
ఇలా అన్నారు. "శాంతికి సౌఖ్యానికి
విశ్రాంతికి తావులేదు. మనము ఎడతెగక
కష్టపడి పనిచేయాలి." కనుక
ఆయన ఆత్మకు శాంతి చేకూర్చడానికి ఎక్కువ పనిచేసి
జాతీయ సంపదకు ఎక్కువ ఉత్పత్తి చేద్దామని కంకణము కట్టుకొందాము.




జె. బి.
మంఘారామ్
& కంపెనీ
గ్వాలియర్ & హైదరాబాదు
OJB-136 TL

# AWARDS!

# WON PLENTY

## YET WE DON'T SAY
## WE ARE THE BEST
### ONLY
## WE DO OUR BEST





**PRASAD PROCESS PRIVATE LTD**

CHANDAMAMA BUILDINGS MADRAS-26

CHANDAMAMA (Telugu) JUNE 1966 Regd. No. M. 4854




అరణ్యపురాణం